# శ్రీ హితసుధాంశువు

ప్రథమ ముద్రణ : 2002

ప్రతులు : 1000

ముద్రణ : కీర్తి ఆఫ్‌సెట్, తిరుపతి

రచయిత : **విద్వాన్ ముచ్చేలి శ్రీ రాములు రెడ్డి**

ప్రతి మూల్యము : రూ. 45/-

ప్రతులకు

**విద్వాన్ ముచ్చేలి శ్రీరాములురెడ్డి**

గాజుల మండ్యము

రేణిగుంట మండలము

చిత్తూరు జిల్లా, ఆంధ్ర ప్రదేశ్

Pin - 517 520

Phone - 71099

**ధార్మిక గ్రంథ ప్రచురణకు రచయితలకు "ఆర్థిక సహాయం" అనే పథకము క్రింద తిరుమల తిరుపతి దేవస్థానము వారిచ్చిన ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ప్రచురింపబడినది.**

# విషయ సూచిక

2 వ భాగము



ప్రార్థన 3 మూడవ భాగము



4 వ భాగము



ఓం నమో వాసుదేవాయ

# కృతజ్ఞతలు

నీ పాదకమల సేవయు,
నీ పాదార్చకుల తోడి నెయ్యమును, నితాం
తాపార భూత దయయును
తాపస మందార! మాకు దయ సేయ గదే!

పారమార్థిక భావనా పరిపక్వానికిది పరాకాష్ఠ. భగవత్సేవ, భాగవత జన పాద సేవ, అపారభూతదయ ఇవి ఉన్నవారికి మఱి దేనితో పని యుంటుంది! ఇవన్నీ ఉన్నవాఁడెంత ధన్యుఁడో చెప్పలేము.

ఇది మనందఱి కర్తవ్యము. ఇట్లు అయిన ఎంత బాగుంటుందో! నాకుఁ దోచిన రీతి భక్తకవి వరేణ్యులు, స్వామి దాసుల రెండు ప్రభాత స్తవాలనువదించాను. వానితోబాటొక శతకాన్ని వ్రాయఁగలిగాను. వాని నొక గ్రంథంముగ ప్రటించ దలచాను.

ఈనా చిన్ని కార్యమొక రూపుదాల్చుచటకు మిత్రుల సహృదయుల ప్రోత్సాహసహకారములందు కొన్నందున నే నీ విషయమున కృతకృత్యుఁడ నైతినని భావించుచున్నాను.

ఈ సందర్భమున మా యన్న గారు కీ.శే.ముచ్చేలి సదాశివరెడ్డి గారిని స్మరించుట నా కర్తవ్యము, కీ.శే. శ్రీ. K. యతిరాజులుగారు (రిటైర్డ్ హెడ్మాష్టరు), అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టరు అవధాని గారు. శ్రీమేడసానిమోహన్ M.A గారు, విద్వాన్ శ్రీ అవిలేలివేంకటరామారెడ్డిగారు (రిటైర్డ్ ప్రధానాంధ్రోపాధ్యాయులు) మున్నగు వారికి నాకృతజ్ఞతా పూర్వక వందనములు!

మఱియు అమెరికా వాస్తవ్యులు శ్రీజువ్వలమోహనరామిరెడ్డి

సదా కవులకు రచనాప్రోత్సాహమిచ్చువారు. అట్లే నన్ను ప్రోత్సహించారు. వారు నన్ను వేమన వంటి కవుల కవన వైదుష్యమును గూర్చి వ్రాయుమనేవారు. ఏమైన కవుల మనస్తత్త్వము తెలిసికొన నుత్సాహపడు కవితాభిమాని. ఎప్పుడూ మరువరానివారు. ఈ సమయమున వారి బంగారుభవిష్యత్తును కోరుకొంటున్నాను. వారికి నా అభినందనలు!!

ముఖ్యంగ ఇల్లాలి చలువ ఇంటిలోని వారికి నిలుకడ చేకూరుస్తుంది. ఈ సమయాన నా సహధర్మచారిణి శ్రీమతి పద్మావతమ్మను గూడ ఈ గ్రంథరచన చక్కగా సాగుటకు కారకురాలుగా చెప్పుకోవలసి యుంది. ఇంకొక మాట పుణ్య స్థలాల దర్శించడం బహుముఖ ఫలప్రదం అంటారు. షిర్డి దర్శన ఫలంగ నా కుమారులు చి॥ M. భరణి కుమార్ రెడ్డి, చి॥ M. జగదీశ్వర రెడ్డి వీరు శ్రీషిర్డి సాయినాథకాగడాహారతులు అను మరాఠీ భాషలోని తెలుఁగు లిపి కీర్తనా రచనను అందించారు. దాన్ని నేను తెనిగించే భాగ్యానికి నోచుకొన్నాను. ఈ కృతిని నా వ్రాత ప్రతిని చక్కని ముచ్చటైన వ్రాత ప్రతిగా వ్రాసి యిచ్చి తన అమూల్య సహచరత్వ భావాన్ని నెల్లడించుకొన్న జనాబ్‌కాశింబేగ్‌గారికి నా ప్రేమ పూర్వక కృతజ్ఞతాంజలులు!.

మరియు అడిగిందే తడువుగా నా రచననందుకొని సావధానంగా ఆమూలాగ్రముగ పరికించి క్లుప్తంగా చక్కని నివేదన నివేదించిన ప్రియ మిత్రులు తిరుపతి వాస్తవ్యులు విద్వాన్ శిరోమణి శ్రీ సముద్రాలలక్ష్మణయ్యగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతా పూర్వక కుసుమాంజలులు!.

ప్రియమిత్రులు విద్వాన్ శ్రీపాండురంగయ్య రిటైర్డ్ ప్రిన్సిపాల్ (ప్రొద్దుటూరు) గారు నేనిచ్చిన మాదిరి అచ్చు ప్రతిని జూచి తగురీతి తోడ్పడ్డారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు!

శ్రీ హిత సుధాంశువు

శ్రీ వేంకటేశ్వరా యునివర్సిటి అధ్యాపకులు ఆచార్య ముచ్చేలి చి|| శ్రీవాసుదేవరెడ్డి (మాయన్న కుమారుడు) తగు సలహాలతో పుస్తకముద్రణాసమయాన సహకరించారు. చిరంజీవికి అతని కుటుంబానికి నా యాశీస్సులు!

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమును జారీ చేయించిన T.T.D కార్యనిర్వహణాధికారి, ఔదార్య మీ పట్టున చెప్పుకోవలసి యుంది. వారికి వారి సిబ్బందికి సహోద్యోగులకు నాకృతజ్ఞతా పూర్వక వినయాంజలులు!

గ్రంథము బహు ముఖాకర్షణగ నున్న నాడు సకల జనామోదము నందుటలోనొక భాగమ్మైయుంటుంది. ఈ తరుణమున చక్కని గెటప్‌తో ముద్రించి యిచ్చిన కీర్తి అఫ్‌సెట్ ప్రెస్ నిర్వాహకులు శ్రీ పులిపాటి పురంధరనాయుడు గారికి వారి సిబ్బందికు నేను సర్వదా కృతజ్ఞుడను. వారికి నాహృదయపూర్వక వందనములు.

మఱెందరో! వారందఱిని సర్వేశ్వరుడు సర్వదా అనుగ్రహించాలని మఱి మఱి కోరుకొంటున్నాను.

ఇట్లు
భక్తజన విధేయులు
ముచ్చేలి శ్రీరాములు రెడ్డి.

18/1/2002

# ప్రార్థన

తే॥ ఓం నమశ్శివాయ! సతీశ! ఓం స్వరూప!
భక్తసందోహ సంసేవ్య భవవిదూర!
లోక కల్యాణి జగదంబ లోలహృదయ!
వసుధ పావని గంగాభవాని నిలయ! 1

తే॥ ఓం నమో నారదస్తోత్ర! ఓం ప్రకీర్త
నాయ! ఓం నమోనారాయణాయ దేవ!
సర్వమంగళ దేవతా సదనహృదయ!
దుష్ట శిక్షణ పారీణ, శిష్టరక్ష! 2

తే॥ సృజన సంశీల! పరమేశ! సుజనతోష!
వేదచతురాస్య! జగదీశ! విమలచరిత!
శారదాహృదయేశ్వర! సరసహృదయ!
భక్త మందార! నినుఁ గొల్తు బ్రహ్మదేవ! 3

తే॥ చదువులొజ్జవై విలసిల్లు సామజాస్య!
విఘ్నమేఘానిల గణేశ! విఘ్నరాజ!
విజయ సంధాన చాతుర్య వేదవేద్య!
మ్రొక్కుచున్నాడ పార్వతీముఖవికాస! 4

తే॥ సరససాహిత్య సంగీత సన్నుతాంగ!
పద్మగర్భు మనోహారి! పరమసాధ్వి!
వేద విజ్ఞానదాయిని! విబుధ వినుత!
సర్వజాడ్యాపహా! కొల్తు! శారదాంబ! 5

# నివేదన.

ఆత్మీయులు, విశ్రాంత ప్రధానోపాధ్యాయులు శ్రీ ముచ్చేలి శ్రీరాములు రెడ్డిగారు నాకు బాల్య మిత్రులు. మేము తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో సమకాలంలో చదువుకొన్నాము.

శ్రీ రెడ్డిగారికి విద్యార్థి దశలోనే కవితా రచనాకౌతుక ముండేది. వీరి సోదరులు శ్రీ సదాశివరెడ్డి గారు `విశ్వగుణాలో'కాది గ్రంథాలు రచించి పేరెన్నికగన్నవారు. కవితా సంస్కారము పూర్వజన్మసుకృతఫలమే కాని సామాన్య విషయము కాదు. వీరి వంశములో ఆ సంస్కారమున్నదనుటకు ఇరువురు సోదరులు కవితాపథంలో నడవడమే నిదర్శనము.

ఉద్యోగ కాలంలో వీరు రచనలేవీ ప్రకటించకపోయినా, విశ్రాంతి పొందిన తరువాత ఈ ప్రయత్నం చేయడం సంతోషకరం.

`హితసుధాంశువు' అన్న పేరుతో వీరు ప్రస్తుతం ప్రకటిస్తున్న గ్రంథాలలో ప్రథమార్థం, ద్వితీయార్థం, తృతీయార్థం అని మూడు భాగాలున్నాయి. ప్రథమార్థంలో శ్రీ వేంకటేశ సుప్రభాతం, ద్వితీయార్థంలో శ్రీ షిరిడి సాయి కాగడాహారతులు ఆంధ్రానువాదములు, తృతీయార్థంలో శ్రీ విఘ్ననాయక శతకము సమకూర్చబడ్డాయి.

గ్రంథానికి వీరు ఎంతో అర్థవంతంగా `హితసుధాంశువు' అని పేరు పెట్టారు. హితకరమైన లేక హితుడైన చంద్రుడు అని ఆ పదానికి అర్థం. చంద్రుడెలా లోకానికి ఆహ్లాదం కలిగించి హితకారి అవుతున్నాడో, అలాగే ఈ గ్రంథం కూడా హితమైన తత్త్వాన్ని బోధించి పాఠకులకు ఆనందాన్ని సమకూరుస్తుందని భావం.

`శ్రీ వేంకటేశ సుప్రభాతం' జగత్ప్రసిద్ధమైన రచన. ప్రతివాది భయంకర అణ్ణన్ గారి కృతిగా ప్రశస్తి పొందిన ఆ కృతి ఈనాడు అబాలగోపాలంలో శ్రీ వేంకటేశ్వర భక్తబృందానికి సుపరచితమే. దానిని పఠించి, లేదా విని ఆత్మశాంతిని, భగవదనుగ్రహాన్ని భక్తులు పొందుతున్నారు.

## నివేదన

శ్రీ వేంకటేశ్వరుని తరువాత అంత ప్రసిదమైన తేజోమూర్తి శ్రీ షిరిడీ సాయినాథుడు. లోకమంతా ఆయనను ఆరాధిస్తున్నది. శ్రీరాములు రెడ్డిగారి స్వగ్రామహమైన గాజులమండ్యంలో ఈ ఆరాధనమూర్తికోక చక్కని ఆలయం నిర్మించబడి నిత్యపూజలు జరుగుతున్నాయి. బహుశః శ్రీ రెడ్డిగారిని ఈ రచనకు పురికొల్పినది ఈ ఆలయమూర్తియే కావచ్చు.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, సంస్కృత రచన కాగా ఇది మరాఠీ భాషలోని రచన. సాయిభక్తులకిది శ్రీనివాసుని భక్తులకు సుప్రభాతంలాగా అనుదిన పారాయణయోగ్యమై ఉన్నది. ఈ రెండు సుప్రసిద కృతులను ఆంధ్రీకరించి శ్రీరెడ్డిగారు తమకవితను సార్థకం చేసుకొన్నారు. వీరిజన్మ ధన్యమైనది.

ఇక చివరిదైన శ్రీ విఘ్ననాయక శతకము వీరి సొంతరచన. బ్రహ్మాది దేవతలు సైతం విఘ్ననాయకుని అనుగ్రహం లేకపోతే ఏ పనిలోను ముందుకు సాగలేరు. శ్రీ గణనాథుడు అఖిలాభీష్టాలను భక్తులకు ప్రసాదించే వేల్పు. ఈ శతక రచన చంపకోత్పలాది వృత్తాలతో పరమ రమణీయంగా సాగింది.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతాన్ని ఇంతకుముందే ఎందరో అనువదించి యున్నారు. శ్రీ షిరిడిసాయి హారతులను అనువదించినవారు కూడా ఎందరో ఉన్నారు. ఐనా తనదైన బాణిలో శ్రీరెడ్డిగారు వీటిననువదించి భక్తుల ఆదరానికీ, శ్రీనివాస-సాయినాథుల అనుగ్రహానికీ పాత్రులయ్యారు. ఇక శ్రీ విఘ్ననాయక శతక రచయితను విఘ్నేశ్వరుఁ డనుగ్రహిస్తాడని వేరే చెప్పనవసరం లేదు కదా!

బాల్యమైత్రిని పురస్కరించుకొని నాలుమాటలు ఇందులో నన్ను వ్రాయమన్నందుకు రచయితకు కృతజ్ఞుఁడను. వీరింకా ఎన్నో కృతులు లోకానికి అందించగలరని ఆశిస్తున్నాను.

*సముద్రాల లక్ష్మణయ్య,*
*తిరుపతి*

ఓం తత్ సత్

ఓం నమో నారాయణాయ

# శ్రీ హిత సుధాంశువు

*సారాంశము*

ఉదయగానంబు భక్తజనహృదయ బృందావనమంద మారుతంబు. భగవత్సేవానంద తన్మయ డోలాయమాన మానసోత్సేకము. పారమార్ధిక చింతన పరమావధి పరమపద సాధనంబు.

శ్రీ వేంకటేశ సుప్రభాతము శ్రీహిత సుధాంశువు నందలి ప్రథమార్ధంబు, శ్రీ షిరిడిసాయి కాగడా హారతులు ద్వితీయార్ధంబు, శ్రీ విఘ్ననాయక శతకము తృతీయార్ధంబు.

సత్కృతి త్రయ విలసిత కావ్య రాజము శ్రీ హిత సుధాంశువు.

## ప్రథమార్ధము

శ్రీ విఘ్ననాయక శతకము. ఇది మౌలికము. సాధారణముగ శతకములు లోకహిత ప్రతిపాదితాంశములతో అలరారుచుండును.

ఈ శతకమునను నటే ``సత్యము, శాంతియున్ దయయు, సాంత్వన బుద్ధియ, దివ్యభావముల్''

ఇటివి అనేక జగదుపకారకాంశములతో నెడనెడ దైవ ప్రార్ధనలతో నొప్పు వృత్త హార సమాలంకృతము శ్రీ విఘ్న నాయక శతకము. హిత-భక్తి సమ్మేళన సందీప్త శతకరాజము.

ముఖ్యిధముల కావ్యసుమ పరిమళంబు జగన్మనోహర దివ్యఫలగుచ్ఛ విలాసము శ్రీహిత సుధాంశువు పఠితలు గ్రహింప ప్రార్ధన.

## ద్వితీయార్ధము

శ్రీ వేంకటేశ సుప్రభాతము చదువరుల సులభగ్రాహ్యాం బునకను గుణంబుగ అనువదించాను. మఱియు మూలముతో పాటు కొన్ని కృతి సంబంధిత అంశముల నీభాగమునఁ బొందు పఱచితిని. కావ్యగుణ సౌలభ్యమునకై స్వయముగ శ్రీ వేంకటేశ్వరుని

గూర్చి వ్రాయఁబడిన పద్యములఁ జేర్చియున్నాను. నిష్కంటకాయత్త క్రియాలోల శ్రీ వేంకటరమణు లీలా కలాప సంలాప సందీప్తము శ్రీ వేంకటేశ సుప్రభాతము. ఇది చదవాలి అని చెప్పకనే చదువ బుద్ధి పుడుతుంది.

ఈ స్తవము శ్రీవేంకటేశ సుప్రభాతము (మేలుకొలుపు), శ్రీ వేంకటేశ స్తోత్రము (ప్రార్థన) శ్రీవేంకటేశ ప్రపత్తి (శ్రీమన్నారాయణు శరణు గోరుట) శ్రీవేంకటేశమంగళాశాసనము (మంగళమును గోరుట) అను నాలుగు భాగముల ననువదించాను.

శ్రీ వేంకటేశ సుప్రభాతము విశ్వమంగళదాయకము, భక్త జన మనోల్లాసము.

భగవత్సేవాపరాయణులు పరమ భాగవతోత్తముల స్వామికైం కర్య విశేషాలు- భక్తజన హృదయ వికాసమునకు దోహదములు.

## తృతీయార్థము

శ్రీ షిరిడీసాయి కాగడా హారతులు. మూలము మరాఠీ భాషలోనిది. దీనిని భక్తజన పఠనానుగుణముగఁ దెనిగించినాను. భావమెఱిఁగి చదువునట్టిది సత్ఫలదాయకము. ఇందు ప్రాతఃస్తవ కాగడాహారతి (మేలుకొలుపు), మధ్యాహ్న హారతి (ఐదు వత్తులతో హారతి), సాయంసంధ్యా హారతి, శేజారతి, (పవళింపు సేవాహారతి) మున్నగు అంశములు గలవు. ప్రభాత సంధ్యాదిగ నాలుగు వేళల పఠించుట కనువుగ వ్రాయఁబడినది. శ్రీ సాయి పూజా సమయ విధులకు తగినటు. శాస్త్రీయముగ ముఖ్య సంస్కృత మంత్ర శ్లోకముల హారతిస్తోత్ర సమగ్రతకై ఇందు చేర్చాను. అనుదినము నియమముతో పూజలుఁ జేయు భక్తుల కుపయుక్తముగ ఉండునటు స్వామి దయా విశేషమున వ్రాయఁగలిగాను. భక్త జన ఫలాకాంక్ష సఫలీకృత దివ్యవస్తువు ఇందుఁ గలదని నాతలంపు.

ఇటు
భక్తజన విధేయుఁడు
*విద్వాన్ ముచ్చేలి శ్రీరాములు రెడ్డి.*

ఓం

వందే నిత్య తేజస్వరూపాయ

# పరిచయము

ఓం హరేరామ! హరేరామ! రామరామ! హరే హరే!
హరేకృష్ణ! హరేకృష్ణ! కృష్ణ కృష్ణ! హరే హరే! ||

నామరూపములు పలు విధాలుగ నున్నను ఫలితము ఒకటే. అదే భగవదనుగ్రహము. సాకార నిరాకార ఉపాసనలలో ఫలమొకటే. అందులో సుగుణోపాసన మేలైనదని అనుకోవచ్చును. శ్రద్ధయును, విశ్వాసమును, రెండూ ఉన్ననాడు దేనినైనను సాధింపవచ్చును. విశ్వాసము శ్రద్ధకు కారణ మౌతుంది. శ్రద్ధవలన జ్ఞానము లభిస్తుంది. జ్ఞానమువలన లక్ష్యాన్ని సాధింపవచ్చును. కాన శ్రద్ధ వలన నసాధ్యాలు సాధ్యమవుతాయి. గాలిలో నెగురుట, నీటిలో తేలటం మొదలైనవి అసాధ్యాలనిపిస్తాయి కదా!

అయినను పట్టుదల, గట్టి నమ్మకమైన కృషివలన గాలిలో విమానయానము జేయఁగలుగుచున్నాము. నీటిలో నీదఁగలుగుచున్నాము. ఓడలలో పయనము చేయఁగలుగుచున్నాము. ఇట్లెన్నో చేయఁగలుగుచున్నాము.

శ్లో|| శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః.
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి||

అను గీతావాక్యము శ్రద్ధను గూర్చి తెలియఁజేయుచున్నది.

శ్రీ వేంకటేశ సుప్రభాతమ్, శ్రీ సాయి కాగడా హారతులను రెండు కృతులు ప్రభాత స్తవములు - ఒకటి సంస్కృతములోనిది. రెండవది మరాఠీ భాషలోనిది. శ్రీ వేంకటేశ సుప్రభాతమును మూడు దశాబ్దాలకు ముందే తెనిగించితిని. ప్రస్తుతము శ్రీ సాయి

కాగడా హారతులను అనువదించితిని. కాగడాహారతులు తెనిగింప దలంచి మొదటి పాత్ర స్తవమును మాత్రం తెనిగించినాను. మిగిలిన భాగాలను దెనిగింప నసాధ్యమనుకొనుకొన్నాను. ఎటైన సమగ్రంగా తెనిగిస్తే బాగుంటుందని భావించాను. అందుకేది దోహద కారియగునో యోచింపగా మెఱుపువలెనొక ఆలోచన స్ఫురించినది. శ్రీ వినాయకుని గూర్చి ఏమైన వ్రాసిన యెడల అన్ని కార్యములు నిరాటంకముగా నెఱవేఱగలవని అనుకొన్నాను. అవిఘ్నముగ శ్రీ విఘ్ననాయక శతకాన్ని సుమారు ఒక మాస వ్యవధిలోనే వ్రాయఁగలిగినాను. పిదప శ్రీ సాయి కాగడా హారతులలో మిగిలిన మూడు భాగములను దెనిగింపఁగలిగితిని.

భక్తి శ్రద్ధలతోఁబాటు భగవదనుగ్రహము నాకు తోడైనందున దీనిని వ్రాయఁగలిగినాను. శ్రీ వేంకటేశసుప్రభాతము, శ్రీ సాయి కాగడాహారతులు, శ్రీ విఘ్ననాయక శతకము, అను ఈ మూడింటిని ఒక సంపుటిగాఁగూర్చి "హితసుధాంశువు" అను పేర ముద్రింపఁదలచితిని.

**శ్రీ విఘ్ననాయక శతకము** : ఈ శతకమును లోకైకహితమును నాధారముగఁగొని హితవు, దానితో బాటు భక్తిని మేళవింపఁజేసి 'విఘ్ననాయక' అను మకుటముతోను, కొన్ని సందర్భములందు వృత్తానుగుణముగ కొద్దిమార్పులుఁజెందిన మకుటములతో పూర్తి చేయఁగలిగినాను. ఏమైనను విఘ్నేశ్వరస్వామి నామస్మరణాదులు, సత్ఫలదాయకంగా నుంటాయి కదా!

**శ్రీ వేంకటేశ సుప్రభాతమ్** : ఈ స్తవము మొదట విశ్వామిత్ర గురువుగారు శ్రీరామచంద్రుని మేల్కొల్పడంతో ప్రారంభమగును. ఇందు రఘురాముని వైభవమును, శ్రీ కృష్ణ లీలలను కడు రమ్యముగ వర్ణింప బడియున్నవి. ఇక కలియుగ శ్రీ వేంకటేశ్వరుని ప్రభాత సేవాదిక అర్చనలు సర్వజన మనోహరములనుటలో నెట్టి సందియము లేదు. ఈ స్తవమునెందఱో తెనిగించారు. నేను కవిని కాను. నా సంతృప్తికై దీనిఁ దెనిగింప సాహసించితిని...

**శ్రీ షిర్డి కాగడాహారతులు** : ఈ మధ్య (1998) నా కుమారులైన చి॥ భరణి, చి॥ జగదీష్‌లు షిర్డి నుండి తీసికొనివచ్చిన తెలుఁగు లిపితో బాటు భావములు గల "శ్రీ షిరిడి హారతులు," అను మరాఠీ భాషా కృతిని చూచితిని. నా భాగ్యవశాన దీనిని అనువదింప సంకల్పము కలిగినది. ఈ కోరికతోఁబాటు శ్రీ విఘ్ననాయక శతకాన్ని కూడ వ్రాసితిని. శ్రీ సాయికృతి ఒక్కొక్కప్పుడు నాలో అనిర్వచనీయానుభూతిని కలిగించినది. మహా భక్తుల స్తవములు మహనీయములు కదా! నలుగురికి అర్థమగు రీతి మాతృభాషలో నిట్టి స్తవములున్న మేలనిపించి వీనిని వ్రాసితిని. కొద్దిగానైన మూలకృతి కర్తల భక్తిభావములు, కవితా పోకడలు గురుసేవా సంభరితమైన హృదయ పరివర్తనమునించుకించుక తెలిసికొన్నాను. శ్రీ సాయి కాగడా ఆరతులు అను నీకృతిని శ్రీ సాయి పూజకు పయుక్తముగ కూడ నుండు నట్లు వ్రాయఁగలిగా నను సంతృప్తి ప్రసాదించిన శ్రీ సాయి నాథుని ఎల్లప్పుడు కృతజ్ఞతాభావమున స్మరించుకుంటూ ఉంటాను.

ప్రజానురంజనం, ఆశ్రితవాత్సల్యం, సుగుణాభిరాముఁడైన శ్రీ రామభద్రుని ప్రధానాశయాలు. ధర్మోద్ధరణ, భక్తుల యోగక్షేమములు శ్రీ కృష్ణుని కర్తవ్యాంశాలు. భక్త జనసంరక్షణ, కలిదోష నిర్మూలనం శ్రీ వేంకటేశ్వరుని ముఖ్యానుష్ఠానములు. ఇట్లు ముమ్మూర్తుల పలు తెఱంగుల ప్రకాశిల్లు శ్రీమన్నారాయణమూర్తి స్తవం శ్రీ వేంకటేశ సుప్రభాతమ్. దీని నందఱు చదివి భక్తిపారాయణ ఫలమందగోరుచున్నాను. శ్రీ సాయి షిరిడీ హారతుల పారాయణమును గూర్చి చెప్పఁ బనిలేదు. ఊరూర, వాడవాడల సాయిభజనలు, సాయి మహిమలు చాటునపుడు నేనేమి చెప్పఁగలవాడను!

శ్రీ సాయి షిరిడీహారతులు భక్తజన హృదయధామ మందారాలు చదవండి. అపూర్వానుభవములఁ దేలియాడఁ గల రనుటలో నతిశయోక్తి లేదు. ఇది ముమ్మాటికి నిజము. చదివి తెలిసికోగలరు. శ్రీ సాయి వాణిసుధాంశువు భక్తజన సంజీవని, భవతాపనివారణి.

ఇక శ్రీ విఘ్న నాయకుని స్మరణమున విశ్వాన్ని దర్శింపఁజేసే శతకం ఈ విఘ్ననాయక శతకం. దీనినందఱుఁదప్పక చదువవలసినదే.

ఈ అంశాలతో హితసుధాంశువు, అమృత కలశాలతోరణాలతో విరాజిల్లుచున్నది. ఇది సర్వజనామోదము నందగలదని ఆశించుచున్నాడను.

సృష్టిస్థితి లయ కారకుఁడు, సర్వమయుఁడు, సర్వలోకాల నిజకృపాకటాక్షములను సర్వదా అందఱిని అనుగ్రహింప పదేపదే వేడుకొంటున్నాను.

సర్వేజనాస్సుఖినో భవంతు.

భవదీయుఁడు

*విద్వాన్ ముచ్చేలి శ్రీరాముల రెడ్డి*

# నామాట.

1. శ్రీ రమాధవ! రఘురామ! చిలిపి కృష్ణ!
కంససంహార! రుక్మిణీ కాంత! నాథ!
వేంకటేశ్వర! కలినాశ! విజయశీల!
విశ్వసమ్మోహ సద్రూప! వినతు లివిగో||

2. ఇమ్ముగ వెలయు ముచ్చేలి యింటివారు
సతి చినక్క, చెంగారెడ్డి, పతికి జోడు
ధర్మవర్తనఁజనగ నా దంపతులకు
సుతులు ముప్వురు మఱియొక సుతయుఁగలదు||

3. నల్వురందున శ్రీరామనామ సుతుఁడ
విమల బోధముపాధ్యాయ వృత్తినాది.
మా నివాసము గాజులమండ్య మనెడి
స్వర్ణముఖినదీ సన్నిధి సత్పురంబు ||

4.ఉ|| నేనొక కావ్యహారమును నెమ్మదిఁగూర్పఁదలంచు చుండుటన్
కానక కానకన్ కవన కార్యముఁజేకొన కొద్ది నేర్పునన్
మానిత పద్యసద్రచనమార్గ విచారణ భక్తిభావనన్
మానస నిగ్రహం బొదవ మౌనికృతంబుఁదెలుంగుఁజేసితిన్||

# వందనములు

నా మాతా పితలు, కీర్తిశేషులు
శ్రీ ముచ్చేలి చినక్క, శ్రీ ముచ్చేలి చెంగారెడ్డి.

తే|| తల్లిదండ్రులు కర్షక ధర్మపరులు.
చిన్న అక్క, చెంగారెడ్డి చెలిమిమతులు.
మాతృ పితృ దేవ హృదయాలు మమత లెనయ
మదినిఁగొల్తు శ్రీరామ సుమంబు లిడుచు.

# సంస్మృతి

సోదరులు, కీర్తిశేషులు శ్రీ విద్వాన్ సదాశివరెడ్డి (నివాసం తిరుపతి) గారు

తే॥ తిరుపతీ పురవాసంబు తిరము, గాగ
వరసుధావాక్కుల గరిమ పరగుచుండి
సరస సాహిత్య సౌభాగ్య చతురుఁడగుచు
సర్వసజ్జన సాంగత్య సరణి వెలసె.

# సంస్మరణ సభ

తే॥ తిరుపతిన్ సదాశివ రెడ్డి ధీర వరుఁడు
వేయిగతులను మిత్రుల వినుతిఁగన్న
సాధు జనచర్య సహజమౌ సరసగతుల
హాస్య వాగ్వల్లరీ వనమనగఁబరఁగె.

తే॥ కాలచక్రాన కనుమూయు కవులలోన
మసిని, గనరాని మణివోలె మసలు చుండి
పరమ విశ్వగుణాలోక, పద్యకావ్య
కర్తవై సదాశివ కీర్తిఁగాంచినావు!

# హిత సుధాంశువు

## ప్రథమార్థము

# విఘ్ననాయక శతకము

ఓం నమః పరమేశ్వరాయ.

అంకితము

అమరులు

పార్వతీ పరమేశ్వరులు

మణిపురాని మాతాపితలు

ముచ్చేలి చినక్క, ముచ్చేలి చెంగారెడ్డి.

పుణ్యాదంపతుల

చరణార విందములకు శిరోభివందనములతో

సమర్పితము.

# కావ్యము

కవితా భావన కల్గినంత రసవత్కావ్యార్థ సద్వర్ణనా
నవ చైతన్య హృదంతరస్థ మహదానందైక శక్తిన్ గనన్
కవితన్ వ్రాయగ నౌనె? సద్విధమునన్ - కావ్యేందిరాలోకనం
బు వినా కావ్యమహాక్రియాధ్వరము సంపూర్ణంబు గాదేరికిన్.

మహాకవి మహర్షులకు నమస్కారములు!!

# మున్నుడి.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల వేద పఠనమునకు సంస్కృతాంధ్ర తమిళ హిందీ విద్వాన్ పట్ట గ్రహీతలకు కల్పకం. సుమారు ఐదు దశాబ్దాలకు ముందు నేనా కళాశాల విద్యార్థిని పలు ప్రాంతాల నుండి వైదిక సాహితీ పరమైన విద్యాభ్యాసమున పట్టము లందుకొనుటకై పలువులు విద్యాభిలాషులు ఆ కళాశాలలో చేరేవారు. ఆటచేరిన వారికి గృహభోజనాది వసతులు విద్యాబోధనము ఉచితముగ తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్వహించేవారు. ఇప్పటికీ నిర్వహిస్తున్నారుకూడ.

ఈ కళాశాల ప్రారంభదశలో కేవలం బ్రాహ్మణులకు మాత్రమే ప్రవేశ ముండెడిది. నేను చదువు నాటికి చాలావరకు ఆ నియమాలు సడలినవి. విద్యాభ్యాసమున దప్ప హాస్టలు విషయంలో మేమందరం ఒక బంతి వారమే.

అప్పట్లో మా పూజనీయ గురువులందు శ్రీచేబ్రోలు సుబ్రహ్మణ్యం శర్మ గారు ఒకరు. ఆయనకు కవిత్వమంటే ఉచ్ఛ్వాస నిశ్వాసలు. శిష్యులందఱు కవులు కావలెనను ఉబలాట గలవారు. కవితా పోటీలలో పాల్గొన్న వారికి తన రచనల కాన్కగ నిచ్చెడివారు.

ఆయన ప్రోత్సాహమున కవులైనవారు ఎందరో ఉన్నారు. నేను సైతము కవితా పోటీయందు పాల్గొని శ్రీ శర్మగారి పారితోషికము నందు కొన్నాను. ఒక విధంగ ధన్యుడను. వారికి కృతజ్ఞుడను శ్రీ శర్మగారి సరస్వతీ విహారము ఒక కవితోద్యానమన్నను అతిశయోక్తికాదు.

కవిత నాకు చాల కష్టమైనదిగ అనిపిస్తుంది. కాని శ్రీ శర్మగారి "కష్ట మిష్టముగా వలె సృష్టి నడుప" అనే మాట తలచుకొని ఏదో కవిత వ్రాసెందుకు పూనుకున్నాను. అయినా పండితుల దృష్టిలో అది కవిత అనిపించుకొంటుందా!

నేను అపారంగా పూర్వకవుల పద్యాలు కంఠగతం చేసి కొన్నవాడనుగాను మఱి నాకు కవితా విశేషాలెట్లు స్ఫురిస్తాయి.

అయినా అప్పుడప్పుడు పట్టుదలతో పద్యాలు వ్రాసే వాడను. కాని కావ్యాలు కాదు సుమా!

శ్రీ వేంకటేశ్వర కృపా విశేషమున చాలా మంది విద్యావంతులును కవులును నయ్యారు. అది అందరికి జీవితాంతం మఱువరానిది.

అందుకు కృతజ్ఞత నెట్లు ప్రకటించుకోవాలో నా మదిలో తలుక్కున తలపు మెదిలింది. శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం తెనిగించిన "చంద్రునకు నూలు పోగ"న్నట్లు స్వామి కృతిని అర్థముచేసి కొన్నట్లుగ ఉంటుంది. స్వకార్యమంటూ ఒకటిచేసినట్లుగ ఉంటుంది. అని తలంచి ఎట్లో ప్రయాసపడి సుప్రభాతాన్ని తెనిగించానని పించుకొన్నాను. కానీ అది ఇంత వరకు ముద్రణకు నోచుకొనలేదు. నేటికది ఫలించింది.

తదుపరి శ్రీ సాయిబాబ "కాగడా హారతుల" మొదలిడి ఉదయ సంధ్యా హారతి మాత్రము వ్రాశాను.

అది చాలనుకొన్నాను. కాని స్వయంగ దేనినైన వ్రాయాలను కొన్నాను.

కార్యసత్ఫలదాయకుఁడు శ్రీ విఘ్ననాయకుని తలంచి "విఘ్ననాయక శతకం" వ్రాస్తే బాగుంటుందనిపించింది. అదేమో గాని 1998 డిసెంబరున మొదలుపెట్టి ఒకటి రెండు మాసాలలో దానిని వ్రాశాను. తదుపరి ఆ శతకానికి ఏమైన వ్రాస్తే బాగుండునని నాయభిప్రాయాలు మీకు విన్నవించుకొనుచున్నాను.

ఎందరో మహానుభావులు ఎన్నోగ్రంథాలు వ్రాశారు. అందున శతక వాఙ్మయాన్ని గూర్చి పండితులకు తెలిసేయుంటుంది. శతకం అనేది కవి జీవితాంతరతవిశేష వివరముల సంపుటి. అది సామాన్యంగ సమాజ సర్వజనీన సన్మార్గ సద్విషయ సందీప్తమై

యుంటుంది. అదికేవలం ఒక వృత్తానికి సంబంధించింది కాదు. వ్రాయఁగ వ్రాయఁగ మనంబునఁ దోచు సద్భావప్రకటనావల్లరి యనుకుంటా.

శతక కవిత కుపక్రమించునపుడు సమగ్ర పథకమంటూ నిర్ణయించుకొని వ్రాయఁజాలమనిపిస్తుంది. వ్రాసేకొద్దీ భావతరంగముల గమన వైఖరులఁ బట్టి కవిత సాగుతూ ఉంటుంది. ఇది నాయించుక అనుభవమున నేను కనుగొన్నట్టిది.

సర్వ ప్రజోపయోగాంశ ప్రకటనసారాంశమే శతక మనుకుంటాను. సంస్కృత భర్తృహరి కవి సూభాషిత త్రిశతి ఎందరో కవులచే తెనిగింప బడియుంది. అందలి అమూల్యవిశేషములు లోకప్రయోజన కారక ఉపదేశములు అందుండుటయే ముఖ్యకారణము.

మకుట ప్రధానంగ పలువురు కవులు ఎన్నో శతకములు రచించి యున్నారు. వేమన, సుమతి మున్నగు శతకములు సమగ్రలోక ప్రయోజన కారక విశేష ప్రకటనకు కారణములై యున్నవి. అవి చాల వఱకు కవి స్వానుభవ విశేష సంకలితములై విశ్వమంగళ దాయక సుభాషితాలతో వెల్లివిరిసి యుంటాయి.

నేను తొలుత విఘ్ననాయక శతమును వ్రాశాను. అది ఎంత వఱకు సత్క్రమ సత్ఫల దాయకమో చెప్పలేను.

శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన కలదాని వ్రాయుటకుపక్రమించాను.

ముఖ్యంగ వాగ్దేవి యనుగ్రహం, స్వకీయ ప్రజ్ఞా విశేష కృషి పలుకావ్యాల పరిచయం, సర్వేశ్వరుని అనుగ్రహం ఉంటేనే కవిత వ్రాయనగుననుస్ఫూర్తి నాలోస్ఫురించింది. కవిత యనేది ఒక యజ్ఞ నిర్వహణ యనిపించింది.

అనువాదముగాక స్వయంగ శతకం వ్రాయుటలో గల యానందము-ఆలోచనల పరంపరలు నాయనుభవైక వేద్యములు.

కవిత-అంటే తేలికయైన పనిగాదు. ఈ శతకము వ్రాసే

సమయాన నాలో కలిగిన యభిప్రాయాన్ని ఒకపద్యం రూపాన వ్రాశాను. అదే తొలిశీరిక "కావ్యము" చదువరుల యభిప్రాయమెట్లుందో చెప్పలేను.

ఈ చిన్ని కృతిలో నాకుఁదోచిన నాజీవితములోని మనస్సునకు స్పందన కలిగించిన ఘట్టములను సమాజమున లోకము సౌభాగ్యమున కెట్టి పథమున పయనించవలసి యుంటుందో నాకు సాధ్యమైనంత వరకు వ్రాయఁగలిగాను.

కృతి సందర్భానుగుణమైన పండుగ పబ్బములు మున్నగువానిని సమయ స్ఫూర్తితో వ్రాశాను.

ఎడ నెడ వృత్తాను గుణముగ పద్యమకుటాన్ని కుదించడము లేక మార్పు చేయడం జరిగింది. అది తప్పని సరిగాన అట్లు చేశాను. కేవలము సమాజ శ్రేయస్కర విశేషముల దృష్టియందుంచుకొని దీనిని వ్రాశాను.

భాషా సౌలభ్యమున్ననే రచన పలువురికి ప్రయోజన కారిగ ఉంటుంది. వారిమన్ననలకు కూడ కారణమౌతుంది. ముఖ్యంగా తల్లి దండ్రులు, పిన్నలు పెద్దలు మున్నగు వారిని దృష్టిలో నుంచుకొని ఈ పద్యాలు వ్రాయడం జరిగింది.

మన సంస్కృతి పౌరాణికేతి హాసముల ప్రధానముగ దీసికొని పురోగమిస్తుంది. మరియు కాలానుగుణముగ ధర్మాధర్మాలు ప్రవర్థిల్లు చున్నాయి. కాన వానిని దృష్టిలో నుంచుకొని దీన్ని వ్రాశాను.

దేనికి కూడ భగవంతుని అనుగ్రహం ప్రధానం. అందుకే 1వ ప||న." నీదయలేని కార్యములు నెమ్మిని సిద్ధిని గూర్చునేవిధిన్?
మోదక సుప్రియ ప్రవర! ముక్తివిభాసుర! విఘ్ననాయకా!"
అని తొలుతగ భగవంతుని వేడుకొన్నాను.4వ ప||న ఇక ధర్మ విధిని గూర్చి -"శాశ్వత మెంచ ధర్మవిధి సత్యపథంబగు విఘ్న నాయకా!" అని అర్థించాను.

16వ ప||న ఒక చోట కవితనుఁ గూర్చి - "కవితానందన కీర్తి

కంటె కలదా గమ్యంబు" విఘ్నేశ్వరా! అని చెప్పుకొనియున్నాను.

ఇట్లే కొన్ని ఉదాహరణములు :-

*42వ ప॥న* "కవి రత్నంబులు కాంతి పుంజ నిధుల్ కావ్యాలు భద్రాంబుధుల్". ఇట్లే పసివారిని దృష్టిలో నుంచుకొని వ్రాయునపుడు 49వప॥న "ముసుగుం దొంగల కాల రాజ్యమిది యే మూర్ఖంబొ"" విఘ్నేశ్వరా!అని వ్రాయడమైనది.

ఇట్లే పలువిధములుగ నా కవితా గమనం సాగింది. నాకుం దోచిన రూపాన నా భావాల వ్యక్తపరిచాను. పాఠకలోకం ఇందులో లోపములున్న సహృదయాలతో మన్నించి నాకృతి నామోదింతురని నమ్ముచున్నాను.

ఇట్లు
భవదీయుఁడు
*విద్వాన్ ముచ్చేలి శ్రీరాములురెడ్డి.*
గాజులమండ్యం.

# శ్రీ విఘ్ననాయక శతకము.

1. ఆదర దృష్టిఁగాంచుము బుధాంచిత పద్ధతి కావ్యనిర్మితిన్-
మోదహృదిన్ నుతించెదను మ్రొక్కులుఁదీర్చెడి పార్వతీసుతా!
నీదయలేని కావ్యములు నెమ్మిని సిద్ధిని గూర్చు నే విధిన్?
మోదక సుప్రియ ప్రవర! ముక్తి విభాసుర! విఘ్ననాయకా!

2. సందియమయ్యె యత్నవిధి. సాధ్యముకాదనుకొంటి తోచకన్
సుందర కావ్యసద్రచన శోభిల సత్ఫలమొప్పు తీరునన్
విందులు చెంగలింప సుకవీశుల మార్గముఁ జూపు మొద్దికన్.
వందన మో గణేశ! సురవందిత సద్గుణ! విఘ్న నాయకా!

3. మక్కువ నెక్కొనన్ కవనమార్గ సువర్ణ వితర్కసద్విధిన్
చక్కని భావసంభరిత సాహితి పద్ధతులుప్పతిల్లగన్,
అక్కజమొప్ప గొప్ప విభవాద్భుత సత్కవనంబుఁ జేకొనన్
మిక్కిలి కీర్తి రాజిలఁగ మేల్మిగఁ జూడుమ! విఘ్ననాయకా!

4. విశ్వము విశ్రుతంబు విధివేద్యము సర్వము భూతరాజితం
బీశ్వర రక్షణాదిక కృపేక్షణ దివ్య విధాయకంబు నా
నశ్వరమయ్యు జీవులు మహావిభవాంబుధి ముక్కలేసెడిన్
"శాశ్వతమెంచ ధర్మవిధి సత్యపథంబగు" విఘ్ననాయకా!

5. సంతత జీవయాత్రలను సజ్జను లుందరు సత్క్రియాదులన్
శాంతి విహీన కార్యముల జాతికి సౌఖ్యము దక్కునేయెడన్?
"దాంతము సత్యమున్, దయయు, ధర్మముఁదప్పని జాతియేకదా!
చింత నెఱుంగకన్ బ్రతుకు" చిత్త నిరంజన! విఘ్ననాయకా!

6. బుధజన సన్నుతా! ప్రజలు మోహపథంబున జీవితాంతమున్
వ్యథలను లెక్కచేయక నవారిత దృక్కుల దోషమెంచకన్
అధమ పథంబునం జనుచు నన్నెము పున్నెము లెంచరజ్ఞతన్.
విధి విదితార్థ సత్క్రియల విజ్ఞతఁగూర్చుమ! విఘ్ననాయకా!

7. వక్రపు మార్గమే కుజన పద్ధతి సద్గతిఁ గాంచనెంతురే?-
సక్రమ మార్గమెట్లొనరు? సజ్జన తత్త్వ విధాన మెంచకన్,
వక్రగుణాళి చెడ్డ జనవైఖరి మానుట సాధ్యమే ధరన్?
వక్రకరంబునన్ వఱలు వందిత నిర్జర! విఘ్ననాయకా!

8. జానెడు పొట్టకోసమయి సత్యము నెంచరు పాడు బుద్ధితో
మానిత ధర్మ్యబుద్ధిగద! మానవ నైజము లోకసౌఖ్యమున్
సూనృత పద్ధతుల్ గనెడి చొక్కపు చేష్టలెటుల్ ఘటిల్లునో
శ్రీనట రాజపుత్ర! సురసేవితసద్వర! విఘ్ననాయకా!

9. సత్యపథంబునన్ జనెడి సజ్జను లెవ్వరో? కోటి కొక్కరే
నిత్యము చూచుచుందువుగ! నిశ్చల భావన దేవళంబులన్
అత్యధికంబునై చనెడి హంతక తత్త్వము మారుటెన్నడో?
ప్రత్యయ భావ బుద్ధిగను భావనఁ జూడుమ! విఘ్ననాయకా!

10. అన్నమొ రామచంద్ర! మొఱ లంతట హెచ్చెను. నీతితప్పెడిన్
ఎన్నగరాని దుష్కృతులు నిచ్చగ వర్తిలె దుర్భరంబుగా.
పన్నగ భూషణాత్మజ! విపన్నులఁ గావగ లెమ్ము!యిమ్ముగన్
సన్నుతిఁజేతు సత్కవన చాతురి భంగిమ. విఘ్ననాయకా!

11. నెమ్మది నిన్నుఁగోరెద వినీతి పథంబుఁ గనంగఁజూడుమా!
సమ్మతి సద్గురూక్తి నెద సంధిలఁజూడుమ! విఘ్నరాజ! నీ
మమ్ము మనంబునన్ మెలగ మానితసుద్గుల నొప్పఁజూడుమా!
యిమ్మలికంబుఁబాపి మము నొద్దికఁ జూడుమ! విఘ్ననాయకా!

12. అర్థము పద్యమున్ గనని యంధకవిత్వము చెల్లదేయెడన్.
ముద్దగు సుద్దులద్దుకొను మోదకవిత్వ విధాన మొప్పెడిన్.
నిద్దపు బల్కులన్ విరుల నింపగు గబ్బివనంబు పోలికన్.
పద్దెము లొప్పగన్ గనుమ! పాండితి రీతుల విఘ్ననాయకా!

13. వ్రాయగఁబూనినేను నొక వైఖరి కావ్యము ధర్మపద్ధతిన్ !
సాయముఁగోరుచుంటి నిను సన్నుతి చక్కని కైతలలగన్!
పాయని భక్తి గీర్తనలఁబాడెద భక్తి వశంబునన్ మనోన్!
సోయగ మొప్ప సత్కవిత శోభిల జూడుమ! విఘ్ననాయకా!

14. చవితిని చంద్రుఁగాంచగ విచారపు నిందల బాధచెందు నా
చవితిని నిన్ను గొల్వ విలసత్కమనీయ సుకీర్తి చేకురున్
కవనముదాత్త పద్ధతి వికాసము జెందఁ దపంబు గావలెన్.
నవిరళ భక్తిఁగొల్తు - పరమాత్మ! ముదంబుగ విఘ్ననాయకా!!

15. అమ్మకు సమ్మతంబగు త దాజను గుమ్మము దాపునుంటివౌ
యిమ్ముగఁ గంఠమున్ శివున కిచ్చెతి వమ్మయుఁదండ్రి మెచ్చగా!
సమ్మతి మాతృభక్తిగతిఁ జాటితి దివ్యశుభంబుకై యిలన్.
అమ్మ పదంబునం గల మహత్తునుఁ జాటిన విఘ్ననాయకా!

16. కవితా భావనఁజేయ హవ్యము గతిన్ గన్పించు హోత్రంబునం
దువలెన్ కావ్యఫలంబలరు, సంతుష్టాత్మ శాంతుండగున్
కవితాలభ్యతఁ గావ్యమబ్బుఁదగ నా కావ్యంబిడున్ శ్రేయమున్
"కవితానందనకీర్తి కంటె కలదా! గమ్యంబు" విఘ్నేశ్వరా!

17. నేనొక పాండితీ ప్రతిభ నెంతయు లేక శుభంబు నెంచితిన్
నానతి యున్న నీ కవనమవ్యయరూపముఁ దాల్చకుండునే!
మానిత కావ్యరీతులను మంగళరంజిత విశ్వగాథలన్
బూనికతోఁబదంబులను బొందుగఁగూర్తును. విఘ్ననాయకా!

18. నేరక నుంటి కావ్యకమనీయ విధాన సుధీవర సత్యమారమున్
సార మనోవనాంతర రసాల ఫలార కుజంబులొప్పగన్,
చారు కృషీవలారిత సుసంపద భాతి పదార్థకావ్యముల్
భూ రమణీయ సస్యరస భూజములుంచెద, విఘ్ననాయకా!

19. శ్రీకర భావ సంజనిత శిల్పకలాపమె! కావ్యధర్మమౌ!
లోక హితంబె గమ్యమగు లోపవిదూర పదార శోభలన్
ప్రాకట భక్తిఁగొల్చుటను భక్తుల యోగము భద్రమెల్లెడన్!
"నీ కరుణన్ ఫలించు భజనీయ విధుల్ కదా!" విఘ్ననాయకా!

20. సంస్కృతి లేని వాడ, పదసంహిత కార్యము సత్ఫలంబిడన్
సంస్కృతిఁ జేయ నీచరణ సన్నిధిఁ జేరితి! భక్తిభావనన్.
సంస్కృతి దేశ శాంతిపద సఖ్యతఁ గూర్చెడి పెన్నిధానమౌ.
సంస్కృతి విశ్వమే ప్రజల సద్విధ ధామము. విఘ్ననాయకా!

21. సత్కవనాంచితప్రభల, సద్వినుతాఢ్యవిధాన సత్రియన్
సత్కట సంభృతాత్మ కవితోజ్జ్వల కావ్యసుధాంచితంబుగన్,
సత్కవితావిశాల ఫలసాధకమై బుధ సమ్మతిన్ గనన్,
మత్కవితన్ వెలార్చెద! నుమాసుత! భక్తిని విఘ్ననాయకా!

22. సర్వజనంబు సత్రియల సన్నిహితత్త్వమునన్ జెలంగగన్
సర్వ విధాన సత్క్రమమె సజ్జన పాత్రముగాఁ దలంచుటన్
సర్వమయంబు సౌఖ్యముగ సాగును. విశ్వము నిత్యకాంతులన్
పర్వముఁగూర్చు భావనల పద్యములల్లెద. విఘ్ననాయకా!

23. పేశల భాషితంబయి, విభిన్న పదాంచిత కావ్యమైనచో
యాశయసిద్ది కరమగునది ముదంబగు విశ్వమంతకున్.
"నీశు కృపావిలోకనము నేరికి సౌఖ్యము నీయకుండునే!"
ఆశలఁబాపి సత్కృతుల నర్హుఁడ జేయుమ! విఘ్ననాయకా!

24. అరయగలేను లౌకికము నంతగ కాంక్షయు లేదు నాయెడన్
దురితపు లోభ సంఘటిత దురతిఁ జెందెడు లోక సంస్కృతిన్
నరయక నుంటి, లౌకిక పదార్థగతంబగునైజ పద్ధతిన్!
కరుణగుణాదులన్ మెలఁగఁ గాంచుమ! మొక్కెద! విఘ్ననాయకా!

25. అభ్యాసాన్విత కావ్య నిర్మితిఁ గదా! ఆనందసంధాయి యౌ
సభ్యంబౌ విధులన్ కవిత్వ పథముల్ సత్కర్మసిదించెడిన్!
"అభ్యాసావశ పాటవంబున గదా! ఐశ్వర్య సంసిద్ధి" వి
ద్యాభ్యాసంబున నమ్రతాది గుణముల్ దైవాఱు విఘ్నేశ్వరా!

26. నియమంబున్, మననంబు సద్విపులమౌ నిర్మాణ చాతుర్యమున్
నయమొప్పన్, పదబంధనావిధుల విజ్ఞానంబు భాసిలగన్,
జయమందన్ కవనంబునన్, చతురమౌ సంధాన ధౌరేయతన్
కయితన్జెప్పగఁ జూడుమయ్య!రసవత్కావ్యంబు విఘ్నేశ్వరా!

27. అరయగ నెంతు సత్కృతి- పదాంచిత సుందర కన్యకా మణిన్
సురుచిర సారసాంబునిధి శోభిత చంద్రవికాస మొప్పగన్
చరిత జగానికిన్ శుభము సంధిల, సత్ఫలకావ్య నిర్మితిన్
బరగఁ నుమాసుపుత్రక! కృపామతిఁ జూడుమ! విఘ్ననాయకా!

28. లౌకికతత్త్వభాషిత విలాస పదోక్తుల మెచ్చఁ జూడుమా!
ప్రాకట భక్తిఁగొల్తు నిను పద్యసుమంబులఁ బూజఁ జేయఁగన్
నీ కరుణావలోకనమె నిశ్చల తత్త్వమెలర్చు సిద్ధులన్.
చేకురఁజేయుఁ గార్యముల! సిద్ధివినాయక! విఘ్ననాయకా!

29. వినుతింపందగు నీకథాళిని, నిజావిర్భావ సంధానమున్,
ఘన దివ్యార్థమనోహరంబు విలసత్కావ్యార్థనిర్మాణమున్,
"కన సత్కావ్య విధానచాతురి వినా కార్యంబు సాఫల్యమే"
వినుతింతున్ కవి వర్యులన్ వినయమౌ విధ్యుక్తి! విఘ్నేశ్వరా!

30. పనిఁజేయన్ దలపంగ భంగమగునే! పాండిత్య మొప్పారగన్
అనుకొన్నంతనె యూహకున్ మనమునందర్థోక్తులబ్బంగ నా
కనువౌ నేర్పు నొసంగవే! కవన మాద్యంతంబు! సౌలభ్యతన్
ఘన కార్యంబు ఘటింపఁజూడుమ! దయన్ గావ్యంబు విఘ్నేశ్వరా!

31. "వినుతారంభ విధాన మారమె కదా! విధ్యర్థ సంప్రాప్తమౌ"
మన మున్నన్ ఫలమబ్బునెట్టియిన సమ్మానంబు సంధిలగన్.
ఘన కార్యంబుననైన గలు శుభముల్ గమ్యంబు సిద్ధింపగన్.
జనసంప్రీతిని బొంద నన్నేనుమ! నాజన్మంబు ధన్యంబుఁగాన్.

32. అన్న ముదమ్ముఁజెందుఁగద! యర్మిలి సోదర యోగమారయన్
నెన్నగరాని యన్నదయ యెంతయు గొప్పది! లోక మందునన్
కన్నదియమ్మనాన్నలు సుఖంబులఁజూతురు యన్నయున్ గనున్
నన్నను మించు వారెవరు! యంతర మిద్దియె!విఘ్ననాయకా!

33. సోదరతత్త్వసత్త్వమును, చోద్యము గూర్చెడి భావనంబునన్
సాదర మూర్తి సజ్జన గుణాంచితమూర్తి సుహృద్వరుండు నా
సోదరుఁడట్టి సద్గుణయశుండు, సదాశివరెడ్డి సత్కృతున్
యాదర శీలునిన్ గనగ నాదట! గొల్చెద! విఘ్ననాయకా!

34. తమ్ముల సమ్మతిన్ గనెడి తత్త్వము మాతృ పితృ స్వభావుఁడున్
నిమ్ముగ నన్నయే సకలమెంచగ - తమ్ముల కల్పకంబు నౌ
యమ్మను తండ్రినిన్ దలఁపు నందున నిల్పిన సాధుమూర్తియౌ
సమ్ముదమారగన్ గొలుతు సాధుజనావన! విఘ్ననాయకా!

35. ప్రేమ సుధాంబుధీ స్ఫురదభిన్న పథాంచిత సత్త్వరూపునిన్
నామది నాసదాశివుని నైతిక బాధ్యత సాధువర్తనున్
ధీమతి నన్న నెన్నెదను తిన్నని తేట నుడుల్ గనన్ సదా
శ్రీమహనీయతేజ! సురసేవిత వైభవ! విఘ్ననాయకా!

36. మాతృ పదంబు మానస సుమాంచిత సంతతికిక్క చూడగన్
మాతృ పథాంచితోజ్జ్వలిత మానస సోదర హృద్వరంబు నౌ
భ్రాతృ సపర్య సంకలిత పాత్రము. భవ్యల సాత్త్వి కత్వమౌ
మాతృ మహానతిన్ జని సుమాంజలి నొప్పిన విఘ్న నాయకా!

37. తల్లిని మించినట్టి యురు దైవము లేదనుమాట సత్యమౌ
నుల్లము పలవించు కడునోర్మిని సంతతిఁ గాచు సక్తితో
తల్లడ మందు బిడ్డని యుదంతము నారయు నంత లోననే
"నెల్ల జగంబు జీవితతి కిట్టులె-బంధము" విఘ్ననాయకా!

38. సంతతి యోగసౌఖ్యములె చక్కనితల్లికి మోదమాలికల్.
సంతతమాత్మ బంధుజన సౌఖ్యము నెంచును భోజనాదులన్!
వంతలు లెక్క చేయక సువర్తన భావన నుండు నెమ్మదిన్!
"అంతియ కాదె! తల్లివిధి యబ్బురమైనది" విఘ్ననాయకా!

39. అమ్మ మనంబు నెన్న-మన మందున నిండును కోటి భావనల్
యుమ్మలికంపు సేద్య విధులోర్మిని నిచ్చలుఁజేయు నొద్దికన్
ఎమ్మెయి నైనమన్ విడువకిమ్ముగ గూర్చును. నెమ్మనంబుతో
సమ్మతిఁగొల్తు తల్లిమది చల్లని జాలిని విఘ్ననాయకా!

40. మానస పద్మనిన్ జలము మాధురిఁ గాంచఁగలేక పోయితిన్
నేనిక పద్యబంధముల నేర్పునెటుల్ గనెదన్ విరాజిలన్
నైనను బట్టువీడక ననంత ముదంబున లక్ష్యమెంచెదన్
జానగు గుజ్జురూప విలసత్ఫలదాయక! విఘ్ననాయకా!

41. కావ్య గుణంబు లొప్పనొక కావ్యము సక్రమ భంగి రాజిలన్
అవ్యయ వృత్తి కావ్యము శుభావహదృష్టినిఁ జేయఁబూనితిన్
శ్రావ్య పదాంచితార్థ గతసంస్కృతి రంజిలు భావనా విధిన్
కావ్యరమాది శక్తులే వికాసముఁ గూర్చుము విఘ్ననాయకా!

42. కవి రత్నంబులు, కాంతి పుంజపు నిధుల్, కావ్యాలు భద్రాంబుధుల్
భవితవ్యంబు జగంబులన్ స్థిరపడన్ భావార్థ సంధానమున్
కవి తత్త్వంబు విరాజిలన్ విబుధ సంఘంబు ప్రమోదంబుగాన్
కవితార్థంబు ఘటింతు-విశ్వగతి సత్కావ్యంబు విఘ్నేశ్వరా!

43. రమణీయార సువర్ణ భూషితము సద్రత్నాది సంధానమున్
కమనీయాభరణాది సంగతము నౌకావ్యాంగనా రత్నమున్
సుమనో హార్య గరిష్టన్, సార రస వచ్ఛోభాకళాసక్తితో
విమలాస్తోక సరస్వతీ చరణముల్ వేడ్క స్తుతింతున్ విభూ!

44. శారద పాదపద్మముల సన్నుతి నెన్నుచుఁ బూజఁ జేసెదన్,
నారద శంకరాది సురనాథ సుమార్చిత పాద భూషితన్,
నీరజ సంసితా సుజన నిశ్చల పూజిత, శారదా సతిన్,
సార విచార సంభరిత సద్రచనావిధి విఘ్ననాయకా!

45. పరమేష్ఠి వరభామినీ! సురనుతా! పద్మాసనా! భారతీ!
విరిపూజాదిక మోదినీ! నిగమ సద్విజ్ఞాత సంప్రేరణీ!
వరభక్తార్చన పాదపద్మయుగళీ! వైదుష్య సద్రూపిణీ!
పరమానంద విధిన్ నుతింతు కరుణన్ బాలింపుమా! భారతీ!

46. నమ్మకమెన్న వమ్మగు గుణంబు. చలంబగు దుష్టులందునన్.
యుమ్మలికమ్ము సుమ్ము! తమ యూహలు రిత్తలు!చిత్తముత్తదే!
మమ్ములు నెమ్మెయిన్ గరుణ మానక! చూడుము! దుష్టశిక్షణా!
ఎమ్మెయి తప్పు ముప్పులు నివేల! తొలంగవు? విఘ్ననాయకా!

47. ఆలన పాలనన్ గనని యర్భక చేష్టలు దుష్టచింతలన్
నేలనొ పాలకుల్ మమత లెంతయు లేకనె చూతురీ ప్రజన్!
పేలన జీవనా విధుల నిబ్బడి జీవిత మీడ్చుచుందు రీ
కాలము చాలు! చాలు నిక కాంచఁగఁ జాలను. విఘ్ననాయకా!

48. జానెడు పొట్ట కూటికయి చంటినిసుంగుల కష్టనష్టముల్
పూనిక సైచి యెటొ తమ పోషణ కార్యమెఱుంగు నాశలన్
మానక వేచి వేచియు నమాయకమౌ వ్యధలన్ గలంగెడిన్
కానగ! నౌనె బాల్యదశ కార్మికపద్ధతి? విఘ్ననాయకా!

49. పసి వారెంతయు మార్దవంబగు మదిన్ బాధామయంబౌ పనిన్
విసుగు న్నైహ్యము నుంతెయున్ గనరు ఏ విద్యా ధనంబుండియున్
నెస లారన్ శిశు సంతతుల్ గనునె! యే హృద్యంపు నుద్యోగముల్
"ముసుగుం దొంగలకాల రాజ్యమిది యేమూర్ఖంబొ! విఘ్నేశ్వరా!

50. లంచము లేని చోటు నెటు లభ్యము కాదులె! లోకమందునన్
నంచెలు వారిగన్ పెరిగె నందల మెక్కె పిశాచి భంగిగన్
ముంచెను లోక మంతయును మోసపు చేష్టలు హెచ్చెనంతటన్
పొంచి చెలంగెఁ గుట్రలును, బుద్ధులుఁదప్పెను విఘ్ననాయకా!

51. అశుభము శుభంబు లేదు నిజ మంతయు చిందర వందరయ్యెడిన్
శుభగుణ మెద్ది నేడు? కలి చూడ్కుల సంధిలె కాలదోషమున్
రభసము లేదు. రాజులు దురాగత భోగులు, సంఘవంచకుల్.
శుభచరితాధిపుల్ కలుగ శోభిలఁజూడుమ! విఘ్ననాయకా!

52. అరమరలేల? ఆజ్యమున నగ్నియుఁబోలె విజృంభి తోద్ధృతిన్
చర చర మూగె లంచపు పిశాచి గమించెను. లోక మంతయున్
సరగున లోకముక్తికయి సాహసరక్కసి నుక్కడంగగన్
పరమ కృపావలోకన సుపాలనఁజేయుము! విఘ్ననాయకా

53. విలువది లేదు నీతికిని విద్యలు నేర్చిన వారికైన నా
కులమున మేలు కందురను కోర్కెల నీతుల నుండరే కదా!
తలఁపగ, కాలమెంతయును తప్పుగఁ జూచును ధర్మమార్గమున్
కలుములఁ గూర్చి మమ్ము కడఁగానగఁ జేర్చుమ! విఘ్ననాయకా!

54. సజ్జన సంతతుల్ గనగ చాటయెఁ గాల వినాశ దృక్కులన్
సజ్జన భావనల్ సడలి దోష విచారము లెన్ను బుదితో
పజ్జనులేరు ధార్మికులు భాగ్యముఁ దప్పెను లోక మేలెడన్
నొజ్జల కొజ్జవై తగిన యొద్దికఁగూర్చుమ! విఘ్ననాయకా!

55. మేలములాడు పద్యముల మించులఁగానక కావ్యభావనల్
చాలని రోజు లివ్వి కలి సన్నిధి యాయెను. చోద్యమ య్యెడిన్
బేలతనంబునన్ మతులు బిట్టుగ తత్తరమందె బుద్ధులన్
నాలయ మందు నుంటివయ! యాదర ముంచుమ! విఘ్ననాయకా!

56. సుజన వితానముల్ దొలగెఁజూపరు లెలరు నంధులెరి గా!
కుజనుల రాజ్య మాయెనుగ! కోప గుణాదుల నిండె లోకమున్
సుజనత పావనంబు కయి శోకముఁ జెందఁగ నయ్యె నియ్యెడన్
గజముఖ విఘ్నరాజ! మముఁ గాచుమ! గోముగ విఘ్ననాయకా!

57. దయయున్, సత్య గుణంబు లుత్తమ మతిన్ ధర్మంబుఁ బాటించినన్
భయ మందన్ బని లేదిలన్ శుభములున్ బ్రఖ్యాత సద్భావనల్
నయమౌ సద్గుణ మానసంబు భగవన్నామాఖ్య సందీప్తమౌ
కయితంబుల్ దెయివాఱు రీతి దయ నాకాంక్షింతు-విఘ్నేశ్వరా!

58. అభయంబియ్యగ రాముఁడుండ, ఘన భద్రాద్రీనివాసాభిరా
మభుమీంద్రుండు, రఘూద్వహుండు, గుణ సౌమ్యాత్ముండు, భద్రంబిడున్
ఉభయంబున్నభయంబుగాఁ దలఁతురందుత్సాహ ధన్యాత్ములై
శుభదంబౌ రఘురాముఁ గొల్తుఁగనఁగన్ శోభాత్మ విఘ్నేశ్వరా!

59. గురువచ నామృతంబు నిడు కోర్కెలు నెమ్మని శిష్య కోటికిన్
మరు లిరులెల్ల డులు కల మంజులకాంతి మతి స్ఫురించు నా
గురుదయ యున్ననాడు కలుగున్ శుభముల్ విమలాత్మసంగతిన్-
వరగురుపాదపంకజముల వందితుఁడయ్యెద విఘ్ననాయకా!

60. కాలము ఘోరకల్మష వికల్పిత తామసవర్తనంబు నౌ
కాలుని పాశ బంధములు గాలపుపోటులు దుష్ట కోటికిన్
"తాలిమి కలు సత్యపథ ధార్మిక చింతనయే బుధాళికిన్.
మేలగు ముక్తి దాయక సమీ కృతధర్మము" విఘ్ననాయకా!

61. దీపము కలునాట నిలుఁదీర్పగ వచ్చును. దప్పదెయ్యెడన్
పాపపు కర్మలం బడకుపాధిఁగనంగ నరుండు సద్విధిన్
"శ్రీపతిచింతనంబునను సేవిత మానస వర్తనంబునన్
నీపద సేవనంబు కద! నిత్యశుభంబగు" విఘ్ననాయకా!

62. పచ్చని పైరు నిచ్చలుపాధిగ జీవితమెల్ల సాగగన్
మెచ్చగు దున్నలన్ భువిని మేలిమి సేద్యము చేయుచుండెడిన్
హెచ్చయినట్టి పట్టుదల నేపగు కష్టము లెక్కఁజేయకన్
మెచ్చను బొందు తండ్రి బలిమిన్ కొని యాడెద విఘ్ననాయకా!

63. సేద్యపు నాద్యపుం గలిమి చేకుర తల్లియుఁ జేయుఁగార్యముల్
సద్యశలక్ష్ములన్ విమల సఖ్యతఁ దల్లియుఁ దండ్రియున్ విధిన్
నుద్యమ శీలురుంగ్రియల నొదిక సొగిరి. సత్ఫలాపేక్షతో
పద్యసుమార్చనన్గొలుతు పార్వతినందన! విఘ్ననాయకా!

64. ఉన్నత మానసంబుల సముద్యమ శీలురు దంపతీవరుల్
మన్నన సంతతిన్ వఱలు మాన్యులు ధార్మిక మారసద్విధుల్
సన్నుత హాలికోత్తమ విశాలహృదిశులు సత్యవర్తనుల్
క్రన్ననఁదల్లి దండ్రుల సుఖంబిడఁగొల్తును! విఘ్ననాయకా!

65. అన్న మనంబు నున్నతము హాస్యవిభూషణ భాషణుండుతా!
అన్నిట దర్శకుండు మము నక్కునఁజేర్చి దయామతిన్ గనెన్!
అన్న సదా శివాఖ్య విభవాత్ముఁడు సౌమ్యుఁడు కీర్తిపాత్రుఁడౌ
సన్నుతి నెన్నుచుంటి విలసత్ప్రియు నర్మిలి! విఘ్ననాయకా!

66. సంక్రమణంబు పుణ్యదిన సద్విధి పెద్దల సన్నిధానమున్,
సంక్రమణోత్సవంబులును సంస్తవ భావన లొప్పఁగూర్చెడిన్
సంక్రమ పద్ధతుల్ సుజన సాత్త్విక దోహద మెంచి చూడగన్!
సంక్రమ పూజఁజేతు పితృశాంతిని సంధిల! విఘ్ననాయకా!

67. విమల వినీల కాంతులను వేడ్కను గూర్చెడి దివ్యమూర్తికిన్
సుమ రమణీయ హారమణిశోభిత మూర్తికి చక్రధారికిన్,
కొమరు రమామనో హర ముకుందుడుఁ గోకుల రక్షణాధికున్,
కమల మనోహరున్ గొలుతుఁ గాంచనచేలుని విఘ్ననాయకా!

68. శబరిమలై ప్రమాదము విచారముఁగూర్చెను సంక్రమంబునన్
కబురును విన్న గుండెలు వికారముఁజెందెను. దేశమంతయున్
గుబురు గుబుల్గ దుఃఖమునఁగ్రుంగని వారలు లేరు చూడగన్
శబరి మలై నివాస గురుసామి నుతించెద! విఘ్ననాయకా!

69. కలికాలంబు మహాపదల్ కనగనే గ్రమ్మున్గదా! శోకముల్
విలయంబున్దలపించుఁగాదె! యిలలోవిధ్వంస దృశ్యంబులున్
కలకంబారు మనంబు, భక్తుల వెతల్ గాంచంగ నెవ్వారికిన్
దొలఁగున్ గాదె! నీదయన్ గలుగునీదోషాలు విఘ్నేశ్వరా!

70. జరుగన్ బోవు విషాదముల్ గనరు సంచార సలిన్ గాంచగన్
పరమాసక్తి జనుల్ ముదంబునను, సద్భక్తినో వ్రతాపేక్షులై
"గురువర్యుల్ కడుభక్తి సేవలను బాగొప్పంగ నయ్యెప్పుఁగాం
చిరి. దైవోపహతిన్ ప్రమాద హతులై చింతింప" విఘ్నేశ్వరా!

71. వేల్మురుగేశు పాదముల విస్తృత భక్తి శిరోభివందనం
బుల్ముదమార నొప్పగనుఁ బూరమనంబున సత్కృతుల్గనన్!
కల్ములు రంజిలంగ రుజకంటక నిర్వృతిఁగాంచు కోరికన్!
పల్మరుఁ గొల్చు వాఁడను! శుభంబులఁ గోరుచు-విఘ్ననాయకా!

72. మదమాత్సర్య గుణాదిషట్కసమితిన్ మాయామయంబౌ మతుల్
యెదయందించుక భీతిలేక జగతిన్ హీనంబుగా జూతు రౌ
మది సద్భావ పథంబునన్ జనిన సన్మానంబుఁ గలుం గదా!
ముదమారన్ నినుఁ గొల్తు లోకసుఖముల్ మున్గోరి! విఘ్నేశ్వరా!

73. అడుగంగా భయమయ్యె నిన్ను గుడిగుమ్మానన్ నివాసంబెటుల్?
యొడబాటున్ విడువంగ లేకను సతీ యొప్పంధమున్ దాల్చితో!
గడచెన్ కాలము భక్తులన్ గనఁగ నీకార్యంబుఁజేకొంటివో!
గుడి ముంగిళ్లు నివాసముల్గఁ గడపన్ గూర్చుండ విఘ్నేశ్వరా!

74. సంఘము మానవోద్ధరణ సంస్కృతి బీజము మానవాళికిన్
సాంఘిక ధర్మమే మతము,సత్యపదాన్విత గమ్యమెంచగన్
సంఘవిధుల్ విభిన్నములు, సత్ఫలమెన్న మతంబు లన్నిటన్
సంఘజనైక్య భావనమె! శాంతికి ధామము విఘ్ననాయాకా!

75. విషయ భవాంబుధిన్ గడపు వేంకటనాథు, సుధీవరార్చితున్
విషమ గిరిన్ వసించుగుణ, విభ్రమ మండన సుందరాకృతున్
విషయ సమంచితార్థ రసవిస్ఫురకావ్యవిధాన సద్విధున్
సుషమ వికాసదేహు, వర సుప్రియుఁ గొల్తును విఘ్ననాయకా!

76. వేంకట రాయు సన్మతి కవిత్వ విధాన పథంబుఁగాంచగన్
పంకజ లోచనున్ గొలుతు! పాపవినాశు పదంబులన్ సదా!
యంకితభావ వైఖరి నతాంజలి వేడెద! భక్త పాలునిన్
సంకటముల్ తొలంగ, కృప సంధిలఁ జూడుమ! విఘ్ననాయకా!

77. శక్తి విభాసినిన్, కుజన సంహృతి సజ్జన రక్షణేశ్వరిన్,
ముక్తివదాన్య సద్విధ విమోహ సదాశివ హృద్విభాసినిన్,
సూక్తి విధాయి, కాళి కవిసూరి వికాసిని కాళికాసతిన్,
యుక్త విధిన్ నుతింతు! మది నుంచి పదంబుల విఘ్ననాయకా!

78. విఘ్నవినాశ వర్తన వివేక విధాన పథంబు భద్రమౌ
విఘ్ననివృత్తి దేవగణ విస్తృతపూజల సిద్ధిఁగూర్చి తౌ!
విఘ్నవిరాజ రాజుగ నవిఘ్న వదాన్యత నొప్పు దేవరా!
విఘ్నవినాయక! క్రియల విజ్ఞతఁ జూపుమ! విఘ్ననాయకా!

79. సిద్ధి వినాయకా! విజయ శీల ఫలార్పిత వైభవోజ్జ్వలా!
బుద్ధి విధాన సాధక! విభూతి సుమార్చిత భక్తతోషణా!
శుద్ధజనావనా! విభవ శోభిత రూప! కృపా హృదీశ్వరా!
సిద్ధిని రాజిలన్ గనుమ చిత్ర జగత్తును విఘ్ననాయకా!

80. సహవాసంబు వివేక సక్తిగతులన్ సౌఖ్యంబుఁజేకూర్చెడిన్
సహవాసుల్ గుణసద్విధుల్ సుగుణులున్ సంభావ్య సంశోభితుల్
సహనంబున్ బరికించి సంచరణులై సాంగత్య మొప్పన్ జనున్
సహవాసంబె - తగున్ సుకీర్తి వఱలన్ - సత్కార్యముల్ నాయకా!

81. దుర్జన సంగతిన్ జనిన దోషపు జీవితదురతిన్ గనున్.
నార్జవ మెంతయున్గనని యల్పుని సంగతి దుష్ట మే విధిన్.
కర్జము సజ్జనత్వము సుగమ్యము సంస్కృతి సత్ఫలంబిడున్
"దుర్జన సంగతిన్ విడువ దొడ్డగుణుండగు" విఘ్ననాయకా!

82. ఒప్పని వారలుందురు. గుణోన్నతి మెచ్చరు! మచ్చరంబునన్.
"ముప్పును గోరుటే ఘనత ముష్కర జాతికి నైజ" మెయ్యెడన్.
నొప్పున గావలెన్ మనసు నున్నత భావ విధిన్ వినీతులన్
మెప్పును గన్నవాఁడె! యెద మిక్కిలి శాంతిలు విఘ్ననాయకా!

83. పచ్చికసాయి గుండెలకు బాపము గీపముఁదోచునే యెడన్
మ్రుచ్చిలు వారి దోషములుమోపెడు-మోయునె? వారిధాత్రియున్
మెచ్చెడి వారి పోలె పలుమేలిమి మాటల మోసగించు నా
ముచ్చుల మానసంబులవి-మూర్ఖత దప్పునె! విఘ్ననాయకా!

84. దంపతు లొద్దికన్ మెలఁగ ధన్యులు వారె! మనంబు లోపలన్
నింపు నశింప నెవ్వగల నిచ్చయు లేక వెతన్ గృశించెడిన్.
సొంపగు భావనన్ గలిగి శుద్ధ విధుల్ గలుగన్ శుభంబగున్
"సంపద లందునన్ సుగుణ సంపద లిమ్మయ"! విఘ్ననాయకా!

85. పండితులైన మాత్రమున పద్యము లల్లగ కష్టమెంతయున్
నిండగు భావ సాగర వినీతఁడు నొగద! పూర్వ సత్క్రియన్
"కొండొక రేఖయున్ గలుగ కోరిన కార్యము సాధ్యమేరికిన్"
"నిండుదనంబె భాగ్యమగు నిర్మల బుద్ధికి" విఘ్ననాయకా!

86.సత్యముశాంతియున్,దయయు,సాంత్వనబుద్ధియు,దివ్యభావముల్
. నిత్యము బాయకున్నతఁడె! నిక్కము దైవ సమానుఁడెంతయున్
"సత్యపథంబులే నరుని సాత్త్విక దైవిక మార్గముల్ గదా!
ప్రత్యయ బుద్ధియున్న గుణ భవ్యత సాధ్యము!" విఘ్ననాయకా!

87. మాటయు మన్ననల్ గలుగ మానవ ధర్మము తప్పదేరికిన్!
మోటుతనంబునన్ మెలగు మూర్ఖుఁడు జంతు సమానుఁడొగదా!
"తేటదనంబునన్ మెలగి దిట్టతనంబున నుండ నేర్చినన్!
మేటిదనంపు గీర్తులను మేల్మిగ నందును!" విఘ్ననాయకా!

88. వాటము కాని కార్యములు వంతలుఁగూర్చును జీవితాంతమున్
మాటలు చేతలున్ గలిగి మానస మొక్కట నొప్పు చుండినన్
మేలు తనంబుచే నలరు మిత్రసమాజము మెచ్చుకోలుగా
నీటగు పాటవంబున వినీతుల నొప్పును విఘ్ననాయకా!

89. పెద్దలు చెప్పు నీతులను పేర్మితనంబున నిచ్చకంబుగన్,
నొద్దిక చొప్పడన్, బనుల నుమ్మడిసత్త్వ నిమ్మడిన్ గనన్
ముద్దుగ మెల్పునన్ గడఁగి మోదమెలర్పఁదగున్ జనాళికిన్!
సుద్ది తనంబునన్ వఱలఁ జూడుమ! తద్దయు విఘ్ననాయకా!

90. మిత్రుల నొవ్వఁ జేయకను, మేలితనంబును మెచ్చు చుండి యా
మాత్రన, మిత్ర గోప్యమును మాటుగ నుంచి మెలంగి మేలుగన్
పాత్రత నొప్పు సంగతిని పాదుకొనంగను, నాదుకొంటయున్
మిత్రగుణాంచితమ్ముగ సుమిత్రతఁజూడుమ! విఘ్ననాయకా!

91. సతతంబున్ సుజనంబుల మెలఁగుచున్ సత్కార్యసంధానుగన్
నుతసల్లాప గతిన్ జనన్ దగుఁగదా! నూత్నంపు సంభావనల్
గతగాథల్ మనంబునన్ మసలఁగన్ గంభీర భావంబులన్
మతి నెంతున్ పునరావృతంబుఁదలఁతున్ మర్యాద విఘ్నేశ్వరా!

92. రవి చంద్రుల్,కుజ సౌమ్య గీష్పతి కవుల్ రాహు గ్రహోర్కాత్మజుల్
స్తవ నీయంబగు కేతువున్, నతి నుతుల్ ధన్యుండగాఁజేసెదన్
కవితా కావ్య గతార్థ ధారరస సాంగత్యంపు కావ్యాధికుల్
కవివర్యుల్, గుణసాంద్రులన్ గొలిచెదన్ కైవార కైమోడ్పులన్!

93. కుకవుల మెచ్చురెవ్వరుఁగుత్సిత వర్తన మొప్పుఁగాంచునే?
సకల జన ప్రయోజన మొసంగెడి సత్కవనంబె రంజిలున్
వికల కుమార్గ కావ్యమవివేక విధాయక మర్థశూన్య మౌ
కుకవన వర్జనంబు తగు కుంభిని రాజిల! విఘ్ననాయకా!

94. శ్రేయముఁ గూర్చు సజ్జనుల శీలము సంతత వృద్ధిఁజెందెడిన్,
సాయముఁ గూర్పఁజేయు గుణసంగతి సత్క్రియ వర్తనాళికిన్,
హాయినిఁ గూర్చు సంపదలు నార్యగుణాంచిత సత్యశాలికిన్,
స్వీయ పదాంజలిన్ గొలుతు సిద్ధిగణాధిప! విఘ్ననాయకా!

95. వ్రాసితి నీకవిత్వపథవైఖరి దోషములుండు కొన్నిటన్,
వేసటఁజెందకన్ దొసఁగు వేద్యముఁ గాగను చెప్పఁ గోరెదన్,
గాసట బీసటన్ దొలఁచ కావ్యము సత్పల మంద నెంచెదన్!
వాసి విరాజిలన్ ప్రజలు వర్ధిలఁగోరెద విఘ్ననాయకా!

96. మిడిమేలంపు జనున్ గనంగ ఖలుఢౌ మేలుం గనండేయెడన్!
జడ భావంబు మదిం గుదింప పగలన్ శౌర్యోద్ధతుల్ జూపెడిన్
కడుగర్వాన కృతజ్ఞతన్ దొలఁచెడిన్ కాలుష్య పాపాగ్నిచే
"యుడుగం బోదు కృతఘ్నుతా ఫలఘునత్యోక్తంబు" విఘ్నేశ్వరా!

97. వినయ భయంబులన్ బడయు విద్యల బుద్ధుల్ లక్ష్యశుద్ధిచే
అనయము కష్టమిష్టముగ నద్భుత సాధన నేర్వగా వలెన్,
చనువున పెద్దలన్ దరిసి చక్కని నీతుల సంతరించుచున్,
కనవలె సభ్యతన్ ధరణి గాఢపు భక్తిని - విఘ్ననాయకా!

98. మతిమంతుల్ వలెదుర్మతిన్ నటనమున్ మర్యాదఁ దోపించున
ట్టతిదుర్బుద్ధిని తలపులన్ వికటమౌ నత్యంత హింసాగతిన్
మతి తప్పన్ వెతఁగూర్చు నాటవికులన్ మన్నించునే సంఘముల్
స్తుతి జేతున్! భవదీయ పాదయుగళిన్ శోభిల్ల! విఘ్నేశ్వరా!

99. చిర కాలంబుగ సాగు లంచముల నాశింపంగ విద్రోహముల్
విరళం బయ్యెను,ముషకరాళికి మతిన్ జనుల్ విద్వేష సంవర్తనన్
"పరువున్ నీతియు నీటి మూటలు కదా! పల్మారు భావింపగన్"
"పరపీడా గతులెన్న పాపపతితుల్ భ్రష్టుల్ గదా!" నాయకా!

100. ఆత్మస్థైర్యము కార్య లక్ష్యగతమత్యాసక్తి యుత్తేజమున్
ఆత్మీయార్థ విధాన సత్ఫలములన్ నందించు సద్భావముల్
ఆత్మానందము చేకురున్. శుభదమౌనార్యోక్తి సంధానముల్,
నాత్మార్థప్రద సంస్కృతాత్మ చరితున్ నర్చింతు! విఘ్నేశ్వరా!

101. కంటిని ఱెప్పపోల్కి, నిలుఁగాంచు విరాజిలు శీలసంపదన్
వంటలు రుచ్యమౌననగ వడ్డనఁజేయును సమ్మతిల్లగన్
నింటి సతీమణుల్ విసుఁగు నెంతయు లేక చరింతు రేయెడన్
వంటలఁదృప్తితో నతిథి వర్యులఁదేల్తురు! విఘ్ననాయకా!

102. నిరతము భర్తతోడుగను నెమ్మది నొద్దికఁజేయు కార్యముల్
పరము నిధానమంచు తగ భర్తను సంతతి నెమ్మిఁజూచెడున్
కరము నిరంతర క్రియలఁగాపుర మొప్పగఁజేయు లీలతో
వర గుణ భావనన్ గృహిణి వర్గము నొప్పును, విఘ్ననాయకా!

103. జీవన మార్గమే పరమ సిద్ధికి మూలముగాఁదలంచెడిన్
పావన వృత్తియే తన యుపాధిగ నెంచి కృషివలా న్వితన్
భావమునన్ ధనార్జిత కృపా స్వజనావన మానసుండగున్,
భావి సుఖార్థ సంవిదుఁడు భర్తయ ధన్యుఁడు విఘ్ననాయకా!

104. జగమునఁబాలనా విభవ సంగతిఁజూచుచుఁ బాలకుల్సదా,
తగు విధులన్ జనంబుల నుదాత్త విధానులఁజేయుఁనేర్పుగన్,
తగవగు దేశమంతయును తథ్యము! రాజ్యము పూజ్యమౌఁగదా!
నగజసుపుత్ర! సిద్ధగణ నాయక కొల్చెద! విఘ్ననాయకా!

105. సీతారాములు పాఠకోత్తములకున్ శ్రీలన్ గృపన్ గూర్చుతన్!
చేతోల్లాస వివర్తనన్ శతకమున్ జిత్తంబు దీపింప నా
ప్రీతిన్ వ్రాసితి. " విశ్వభాగ్యమె కదా! పేర్మిన్ శుభంబుల్ గనున్"
మాతంగానన! విఘ్నరాజ! శుభసామ్రాజ్యాధిపా! శ్రీకరా!

106. గుణముల్ పాడగు-బాంధవంబెటుఁగరే కోశాన, మాంద్యంబునన్,
గణుతింపన్ వికటింపగన్ మురుకుచున్ గర్వోక్తి దూషించెడిన్,
క్షణమైనన్ తిలకింప రెంతయును సఖ్యం బింత రౌద్రంబుతో
నణు మాత్రంబు పగన్ వహింపనగునే యావంత! విఘ్నేశ్వరా!

107. పగబూనన్ జెడుఁగాదె! కౌరవపతుల్ పాడైరి దౌర్భాగ్యతన్,
వగలన్ గూర్చును, నైక్యతా రహిత వక్రంపు చేష్టల్ గనున్,
తగువందన్ సహనంబు లేక కడు పంతానన్ వడిన్ దొట్రిలున్,
"మిగులన్ గూర్చు శమంబు శాశ్వత గతిన్ మేలందు" విఘ్నేశ్వరా!

108. అన్ని గుణంబులందు మణిహారము శాంతమె! దివ్యధామమౌ!
నున్నత భావరంజిత గుణోదయ హృద్గత దివ్యతేజమౌ
సన్నుతలోక భాగ్యనిధి శాంతము భద్రము! జీవకోటికిన్
సున్నితబుద్ధి గమ్యమిది-చూడగ తథ్యము! విఘ్ననాయకా!

109. దివ్య గుణాంచితాఖ్యలను దీటగు సార్థక నామ కీర్తనన్!
భవ్య జయంబు భావన విభాసిలు నీ జననాఖ్యఁదెల్పుమా!
కావ్య సుధీవరార్చిత! వికాస! సుకార్య జయార్చితాధిపా!
అవ్యయ సామజాస్య విభవార్చనసంవిద! విఘ్ననాయకా!

110. వరగురు సిద్ధపూజ విభవాంచిత విక్రమ కార్యభాసురా!
పరమ వివేక సంఘటన భవ్య గణాధిప! మాతృ హృద్విదా!
సురముని సేవితా! సుగుణ సుప్రభ! సత్త్వ శుభంకరేశ్వరా!
సరస పదాంచితా! శతక సత్కృతి సంప్రద! విఘ్ననాయకా!

111. శుభము! సుధీవరార్చన యశోప్రభ వాంఛిత విఘ్ననాయకా!
అభయ విధాన హస్త! విమలార్చన! సద్గురు! విఘ్ననాయకా!
విభవ విధాయకా! విబుధ వేద్య! పరాత్పర! విఘ్ననాయకా!
శుభము! శుభంబు! సాంబశివ సూన! సతీసుత! విఘ్ననాయకా!

*సర్వే జనా స్సుఖినో భవంతు.*

*ఓం శాంతిః శాంతిః శాంతిః ||*

ఓం నమో లక్ష్మీ నారాయణాయ

హిత సుధాంశువు

ద్వితీయార్థము

# శ్రీ వేంకటేశ సుప్రభాతగీతావళి

ఆంధ్రానువాదము

విద్వాన్ ముచ్చేలి శ్రీ రాములురెడ్డి

అంకితము

శ్రీ పద్మావతీ వేంకటేశ్వర పాదపద్మములకు

ఈ శానాం జగతోస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షఃస్థల నిత్యావాస రసికాం తత్క్షాంతి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్||

ఓం నమో వేంకటేశాయ శేషాద్రి నిలయాయ చ|

వృష దృగ్గోచరాయాథ విష్ణవే సతతం నమః||

# మనవి

భక్తులు మనసా వాచా కర్మణా తమ జన్మసాఫల్యమునకై భగవంతుని సేవిస్తారు. ఇహపరలాలసత్వమే సాధారణముగా భక్తులకు లక్ష్యమై యుంటుంది. పూర్వజన్మ సుకృతంబున మోక్షమే పరమ లక్ష్యముగ భావించేవారు అరుదుగ ఉంటారు. ఏది ఎట్లున్నను, భక్తిభావన అనంత మానవకోటికిఅమూల్య శ్రేయోదాయకము. ఆత్మవిశ్వాసమునకది ప్రధానా ధారభూతమౌతుంది.

భగవత్సేవాపరాయణుల వృత్తాంతాలు మానవ జన్మసార్థక్యమునకు దృష్టాంతాలు. జీవుడు చావుపుట్టుకలతో సతమతమౌతూ ఉంటాడు. అట్టియెడ భక్తిమార్గము సుగమమౌతుంది. మహామనీషుల భక్తిరసామృత కృతులెన్నో కలవు. కావ్య మన్ని విధముల విశ్వశ్రేయస్సును జేకూర్చును. అందున భక్తిరస ప్రధానమైన కృతి మనుజుని పరమాత్మునిలో చేర్చఁగలదు. పరమాత్మనిగఁజేయఁగలదు.

ఒక సత్కృతి పలువురికి సన్మార్గదాయక మగును.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

సజ్జనులఁజూచి సద్విషయములఁదెలిసికొని దానిని ప్రమాణముగ దీసికొనుటే ఇందలి సామాన్య అర్థము. కావున, మానవోద్ధరణకు సత్పురుషులే మార్గదర్శకులు. మహనీయుల ననుసరించుటయే మానవుని ప్రధాన ధర్మము. ధర్మము నుద్ధరించుటయే భగవంతుని ప్రధానాశయము. యుగయుగములందు భగవంతుఁడు అనేక రూపములలో అవతరించి, లోక రక్షకుఁడుగా నున్నాడని ఇతిహాసముల వలనఁదెలయచున్నది.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానమ్ సృజామ్యహమ్॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

అని భగవానుఁడు కృష్ణావతారమున, అర్జునున కుపదేశించి యున్నాఁడు. ఇది ధర్మోద్ధరణకు ఒక చక్కని తార్కాణము. గీతార్థప్రబోధితులైన వారే లోకోద్ధరణమునకెన్నో సత్కృతులు, సత్కార్యములఁ జేసియున్నారు. అందే - శ్రీ వేంకటేశ సుప్రభాతము అణురూపమున నున్న మహోత్కృష్టమైన సత్కృతి. దీనిని 15వ శతాబ్ద్యంతమున నుండిన `శ్రీ రమ్య జామాతృముని, శ్రీ మనవాళ మహాముని, మరియు శ్రీ అనన్గర ఆచార్యులు" అను నామముల వ్యక్తమగుచున్న ప్రతివాది భయంకర అనంగాచార్యులు రచించి నట్లు తెలియుచున్నది.

ఈ కవిగారి బహుపురాణ శాస్త్ర పరిజ్ఞానమునకు ``శ్రీ వేంకటేశ సుప్రభాతమ్, అను" స్తవము, ప్రథమ తార్కాణము. ఇందులో 1. శ్రీ వేంకటేశ సుప్రభాతమ్, 2. శ్రీ వేంకటేశ స్తోత్రం, 3. శ్రీ వేంకటేశప్రపత్తిః, 4. శ్రీ వేంకటేశ మంగళాశాసనమ్ అను నాలుగు భాగములు గలవు.

విష్ణువు రామాది యవతారము లెత్తిన అనంతరము కలియుగమున శ్రీ వేంకటేశ్వరులు పద్మావతీదేవి సహితులై, అర్చావతారమూర్తిగాఁ నవతరించినట్లు కొనియాడ ఁబడియున్నది. ఇందు, త్రేతాయుగమందలి రామావతార లీలలు, కడురమ్యముగ వర్ణింపఁబడియున్నవి. శ్రీ వేంకటేశ స్తోత్రమున నొకచోట ద్వాపర భగవానుఁడయిన శ్రీ కృష్ణుని గోపికాలీలలు వర్ణింపఁబడియున్నవి. కలియుగ శ్రీ వేంకటేశ సుప్రభాతస్తవము మూఁడు యుగముల మమ్మూర్తుల విష్ణుమూర్తి యవతార విశేషములతోడి వర్ణన లుండుటలో దీని యౌచిత్యమును గమనించవచ్చును.

బ్రహ్మాది దేవతలు, దిక్పాలకులు, నారదాది మునులు, అత్ర్యాది సప్తర్షులు, నవగ్రహములు శ్రీ వేంకటేశ్వర స్వామివారిని ప్రభాత సమయాన సేవా దర్శన భాగ్యము లందుకొనుటకు వచ్చినట్లు కడుహృద్యముగా వర్ణింపఁబడియున్నది. గోపకులు, గోగణము,

పాడి, పక్షుల కిలకిలారావ మహోల్లాసముతో నొప్పు ప్రకృతి రమణీయత కన్నులకుఁగట్టినట్లు జెప్పఁబడియున్నది.

కవి కాలమున తిరుమల ప్రాంతమున గల పర్వతారణ్యా వాతావరణ దృశ్యములెంతో ఆనంద హృదయాహ్లాదకరములుగా నుండినట్లు రచనల వలనఁదెలియుచున్నది. సుమారు మూడు దశాబ్దములు నాడు నా ఓపిన కొలది తెనిగించి యుంచిన దీనిని మా సోదరులైన శ్రీ విద్వాన్ యం. సదాశివరెడ్డి గారు దీనికొక రూపు నిచ్చి ముద్రింపఁదలచారు. కాని, అర్థాంతరముగ నీ ప్రయత్నమాగిపోయినది. అయినను నేను దీనినెట్లైనను సఫలీకృతమొనరింపఁబూనితిని. ఇది భక్తజనులకు చక్కగాఁ నుపయోగపడఁగలదని విశ్వసించుచున్నాను.

శ్లో॥ శ్రీ రామం వాసుదేవం శ్రీ వేంకటేశ్వరమాశ్రయే।
సీతాం రుక్మిణీదేవీం దేవీం పద్మావతీమ్ భజే॥

త్రేతాయుగమున సీతారాములు గాను, ద్వాపరమున రుక్మిణీ కృష్ణులు గాను, కలియుగమున శ్రీ పద్మావతీ వేంకటేశ్వరులుగాను అవతరించిన శ్రీ లక్ష్మీనారాయణ మూర్తులకు నా నమస్కారములు! శ్రీ వేంకటేశ సుప్రభాతకృతి శ్రీవారి తొలిపూజోపకరణమైనందున ఈ మూలకృతికర్త మహాధన్యుఁడు. శ్రీ ప్రతివాది భయంకర అనంగారాచారికి నా కృతజ్ఞతా పూర్వకవినయాంజలులు!

శ్రీ వేంకటేశ సుప్రభాత పఠనమున గాని, శ్రవణమునగాని, కోటి దోషనివృత్తి ఫలముల పొందఁగలరు. నాచే తెనిగింపఁబడిన 'శ్రీ వేంకటేశ సుప్రభాత గీతావళి' నిఆదరించు భక్తజనసందోహము శ్రీవారి కృపాకటాక్షము మెండుగ ఁబొందగలరని ఆశిస్తున్నాను.

సర్వేజనా స్సుఖినో భవంతు!

భవదీయుఁడు.

*ముచ్చేలి శ్రీరాములు రెడ్డి.*

# ఓం నమో వేంకటేశాయ

1. నీవు కొండ నెత్తాననే నిలిచి యుండ
కొండ దిగువనె తిరుచాన కొలువుదీరె.
వేంకటేశ్వర! మీ తీరువింతలరయ
చెలిమి హృదయాల కిది యొక వెలుగు బాట!

2. శ్రీనివాస! దయానిధి! శేషశయన!
వేంకటేశ్వర! మాధవా! విబుధ వినుత!
ఏడుకొండలయొడయుండ! వేడుచుంటి!
విష్ణుదేవుఁడ వీవంచు వేంకటేశ!

3. అమ్మ! వాత్సల్య సముపేత! ఆదిమాత!
వేంకటేశ్వరీ! కమలాక్షి! విభవశాలి!
భవ్యపద్మావతీ! సతీ! పద్మనిలయ!
లక్ష్మి వీవంచు వేడెద లలిత మాత!

4. వేంకటేశు పద్మావతీ విభవ విధుల,
లోక కళ్యాణ సంభూత నాకవరుల,
సర్వయుగ ధర్మ సందీప్త సదయగతుల,
చరణ పద్మాలఁగొల్చెద శరణుఁగోరి.

## శ్రీ వేంకటేశ సుప్రభాత కర్త

మాన్య సుందర జామాతృమౌని, యంచు
నెమ్మి సౌమ్యోప యంతృమౌని, యని పిలుతు
రట్టి మణవాళ కవి ఋషి నధిక భక్తి
మ్రొక్కుచుంటిని వినయాన మోదమంద.

అరి భయంకర వాదియు నారకవి, య
నంగరాచారి శ్రీ వేంకటాధిపుకృతి
సుప్రభాత సౌందర్య సుశ్లోకకర్త
నతులఁగొలుతును మణవాళ నామునిని.

# శ్రీ వేంకటేశ సుప్రభాత ప్రశంస

1. ఉ|| ఆర్షము సుప్రభాతము మహామహిమాన్విత మాత్మ బోధమున్,
వర్ష శుభోదయంబు, మణవాళ మహర్షి కలాప రత్నమున్,
హర్ష సుకీర్తనంబు నుదయాహ్నిక కార్య సుదర్శనంబు నౌ
హార్షముఁ గూర్చు విష్ణు హృదయార్ద్ర సుకీర్తిన భక్తపాళికిన్.

2. ఉ|| మానవయత్నమార్గము సమంచిత ధర్మ విధిన్ కనంగ
నౌధ్యానవిధానమే విబుధ ధర్మమటంచుఁదలంచి పూనితిన్
మానిత భక్తిఁగూర్చు హరిమంజుల గీతిక మానవాళికిన్
దానవ శిక్షణా చరణ దక్షుఁడు ధర్మముఁ గాచునే గదా!

3. ఉ|| దేహరథాంచితాత్మయె- రథీశుఁడు. సారథి బుద్ధి చుడగన్
ఆ- హృదయంబె పగ్గము,సదాత్మ,సుబుద్ధియు, మానసంబులున్
ఊహాప జీవితా చరణమందున వెల్గును గూర్చు దేహికిన్
మోహ విదూరుఁడౌ ఘనవిముక్తి వదాన్యుఁని విష్ణుఁగొల్చెదన్.

4. ఉ|| ఆది కవీశ్వరాది కవులార్ష కవిత్వ విభుత్వ మొప్పగన్
ఆదరభావనన్ కవనమల్లిరి భారతకావ్యపుంజముల్.
ఆదిమ కావ్యకర్తల గుణాఢ్యుల భక్తిని గొల్తు నెన్నడున్
నాదగు చిన్ని కబ్బము నవ్య కవిత్వ సుమాంజరీవిధిన్!

5. ఉ|| భక్తినిధానకీర్తనల భావనలాత్మవికాస ధామముల్,
ముక్తివిధాయకంబులవి మోదము గూర్చును భక్త పాళికిన్!
సక్తిని నీపదంబులను చక్కని వైఖరి కావ్య పద్ధతిన్
రక్తినిఁ గూర్ప జూడుము సురార్చిత శోభిత వేంకటేశ్వరా!

# శ్రీ వేంకటేశ సుప్రభాత గీతావళి.

## శ్రీ వేంకటేశ సుప్రభాతము

(పద్యములు : 29)

1. రామ! కౌసల్యా సత్పుత్ర! రమ్య తేజ!
తూర్పు దెసయందు తొలిసంజఁ దోచెకాంతి
దైవ మాహ్నిక కృత్యముల్ తగును జేయ,
పురుషశార్దూల! లెమ్మయ్య! పరమ పురుష!

2. మేలు కొనుమయ్య! గోవింద! మేలుకొనుమ!
లెమ్ము! గరుడ ధ్వజ! రమేశ! లెమ్ము కృష్ణ!
లెమ్ము! కమలేశ! కరుణాత్మ! లెమ్ము వరద!
లెమ్ము! ముల్లోకములకు శుభమ్ము లిమ్ము!

3. సర్వలోకైక మాతవు సన్నుతాంగి!
దేవి! మధుకైటభారిమనోవిహారి!
అశ్రితానంద దాయినీ! అమరవినుత!
భవ్య పద్మావతీ! సుప్రభాతమమ్మ!

4. బ్రహ్మ రుద్రేంద్ర వరసతీ ప్రణుతసాధ్వి!
దివ్య చంద్రాస్య! సౌజన్య దృక్తభాస్య!
వృషగిరీశహృదయవర్తి! విబుధ వినుత!
పద్మభూషితాంఘ్రీ! సుప్రభాతమమ్మ!

5. సప్తఋషులర్థి సంధ్యను సంధ్యవార్చి,
గగనధుని కమలాలను కరములుంచి,
నెమ్మి పాదపూజలఁజేయ నిలిచినారు.
పన్నగాద్రీశ్వరా! సుప్రభాతమయ్యా!

6. బ్రహ్మశంభు కుమారేంద్ర ప్రభృతులెల్ల
మీదు త్రైవిక్రమాది ప్రసాద గాథ
భక్తి భావనా నుతులను బరగినారు.
పగటి శుద్ది బృహస్పతి పాడుచుండె.
పన్నగాద్రీశ్వరా! సుప్రభాతమయ్య!

7. కొద్దివిచ్చిన తామరల్ కొబ్బరులను
పోకి మున్నగు మోవుల పొలుపు మిగుల
పరిమళింప పవనమల్లఁ బర్వసాగె.
పన్నగాద్రీశ్వరా! సుప్రభాతమయ్య!

8. మేల్మియౌ గూటి చిలుకలు మేలుకొనుచు
పళ్ళెరంబుల మిగిలిన పండ్లఁదినుచు
పాయసంబాని లీలలఁ బాటపాడె.
పన్నగాద్రిప్రభూ! సుప్రభాతమయ్య!

9. భవ్యనాదంపు తంత్రీవిపంచి వెలయ!
పాడె నీయనంత చరిత ప్రతిభ గూర్చి.
హస్త వాక్సమగ్ర గతుల నమర మౌని
పన్నగాద్రిప్రభూ! సుప్రభాతమయ్య!

10. భృంగ సంతతి మధువాని ప్రియము మీఱ
ఝంకృతీ కృతులొప్పఁగ, జన్మరహిత!
తమ్మి పువ్వుల వెల్వడె మిమ్ముగొల్వఁ!
బన్నగాద్రిప్రభూ! సుప్రభాతమయ్య!

11. గొల్లయిండ్లను గోపికల్ చల్లచిలుక
కడలు కడవలు గావించు కలహమనగ
పెరుగు పాత్రలన్ నినదముల్ పెలుచ వెడలె,
పన్నగాద్రి ప్రభూ! సుప్రభాతమయ్య!

12. తుమ్మెదల పిండు నిజకాంతితోడ కలువ
కాంతుల హరింప రొదఁజేయు కాహళి యన
పద్మ సద్మాల శబ్దాలు పరిఢవిల్లె
పన్నగాద్రిప్రభో! సుప్రభాతమయ్యె!

13. శ్రీశ! యిష్టవరప్రద! శ్రీనివాస!
లోక బాంధవ! నిఖిల లోకైక రక్ష!
శ్రీ రమావాస హృద్వర! చిద్విలాస!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యె!

14. స్వామి పుష్కరిణి మునుఁగ స్వస్థు లగుచు,
వేత్ర తాడన శిరముల వినతు లగుచు
హర విరించి సనందను లర్థిఁగొలువ
వేచి యున్నారు వాకిట - విమల భక్తి-
భవ్యవేంకటేశ్వర! సుప్రభాతమయ్యె!

15. వేంకటాద్రి, గరుడ గిరి, వృషభనగము,
శేష శైలము, వృషగిరి చెలువు మీరు
పరమ నారాయణాద్రియుఁబరగునంచు
పల్కుదురు. నీవసతి సుప్రభాతమయ్యె!

16. ఈశ దేవేంద్ర పవమాను లింపు మీర
ధర్మనైఋతి, వరుణులు, ధన విభుఁడును
అనిలుఁడున్ వేచియున్నారు వినతు లగుచు-
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యె!

17. నీదు సంచార సమయాన నియమవిధుల
గరుడ పంచాస్య శేషాశ్వ గజవరాళి,
స్వీయ ప్రభుతాదు లర్థింపఁ జేరెఁగడకు!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యె!

18. దేవ! సూర్యేందు భౌములు, దివ్యబుధుఁడు,
గురుఁడు, శుక్రుఁడు, శనియును బరమ భక్తి,
రాహుకేతు నవగ్రహ రాశివారు,
దాసదాసాను దాసులై తనిసినారు.
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యా!

19. స్వర్గమోక్షాది కాంక్షల సరకుఁగొనక
కల్ప సంభవ విభ్రాంతి కలితు లగుచు
నీదు పద ధూళి శిరముల నెమ్మి నిడిరి.
భవ్య వేంకటేశ్వర! సుప్రభాత మయ్యా!

20. స్వర్గ మోక్షముల్ కనఁబోక సత్యగతులు
నీదు గోపుర శృంగముల్ నెమ్మిఁగనుచు
సంతసమున నిల్చిరి నీదు చెంతనుండ,
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యా!

21. పద్మనాభ! జనార్దన! పరమపురుష!
వాసుదేవ! వైకుంఠవాస! వరద!
చక్రపాణి! ఆశ్రితకల్ప! సకల గమ్య!
శ్రీశ! శ్రీవత్సలాంచన! శిష్టరక్ష!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యా!

22. వసుధ నాయక! శ్రీధవ! వరగుణాబ్ధి!
దేవతాధిక్య జగదేక దీనరక్ష!
శేషగరుడాది భక్త సంసేవ్యపాద!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యా!

23. మన్మథుని మించు క్రొమ్మించు మదనమూర్తి!
ప్రేయసీకుచ లోలాక్ష! విమల హృదయ!
నిర్మలగుణాఢ్య! శుభకరా!నిగమవేద్య!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్యా!

24 మత్స్య, కూర్మ, వరాహముల్, మనుజ, సింహ
వామన, పరశు, బలరామ, వాసుదేవ!
దాశరథి, కల్కి రూపముల్ దాల్చితీవు.
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

25. వైదికోత్తము లేలా లవంగములను
పచ్చ కర్పూర వాసనాభరితమైన
దివిజగంగాపగ పరమ తీర్థజలము
నిండు హేమపాత్రలఁదాల్చి నిలిచినారు.
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

26. ప్రొద్దుపుట్టెను, తమ్ములు ముద్దులొలికె!
పక్షులెల్ల నిస్వనములఁ బరిఢవిల్లె!
పాడుచున్నారు వైష్ణవుల్ భక్తినుతుల!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

27. బ్రహ్మ మున్నగు సురవరుల్, పరమఋషులు
వర సనందనాదిఋషులు వరలి చెంత,
పూజకై శుభవస్తువుల్ పూనినారు.
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

28. సుగుణ సాగర! మాధవ! సురవిభూష!
భవసముద్ర తరణపాత్ర! పరమపురుష!
భక్తరంజన! శ్రుతివేద్య! భవవిదూర!
భవ్య వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

29. ఎవరు దీని బ్రాహ్మీ ముహూర్త ఘడియలఁ
జదువ చుందురు శ్రద్ధగ చవులు మిగుల
నట్టి జనులకు హరిగీతి యమరఁజేయు.
మోక్ష మిచ్చెడి ప్రజ్ఞాది ముఖ్యవిధుల.

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రము

1. రమణి పాలిండ్ల కుంకుమ రంగువలన
   నరుణ వర్ణంబుఁ గలసియు కరుణహృదయ!
   నీల వర్ణాన మించెను. నీదు తనువు!
   విజయ మగుఁగాక! కమలాక్ష! వేంకటేశ!

2. దాత, శివుడు, కుమారాది దైవ తతికి
   మౌళి మణివైతివి పునీతమహితచరిత!
   శరణుఁడవు భక్తజనులకు సాధురక్ష!
   దయను గావుమ! శ్రీపతీ! ధర్మరక్ష!

3. అధిగమించిన పాపాల నాచరించి
   పరమ పాపుఁడనైతిని పద్మనాభ!
   వేంకటేశ్వర! కరుణింప వేడుచుంటి.
   ముక్తిఁజూపుమో! దయతోడ భక్తవరద!

4. వేంకటాచలాధినివాస! విపుల హృదయ!
   జనుల కోర్కెలఁదీర్చెడి ఘనత నొప్పి
   వేదతతిఁ బరదైవాంశ వినుతిఁగన్న
   పరులనొల్లక నినుఁగొల్తుఁ బరమపురుష!

5. వేణుగానంబు వినుటచే వివశలైన
   గోపికా సహస్రములచేఁ గూడియాడి
   కూర్మిఁగూర్తువు. సుఖముల గోపికలకు,
   పరుని నెఱుఁగను నీకంటె పరమపురుష!

6. వేంకటేశ్వర! రఘురామ! వేదగమ్య!
   దశరథేశ్వరపుత్ర! కోదండ రామ!
   ధైర్యగుణ భూష! లక్ష్మీశ! దనుజహనన!
   వరము లొసఁగుమ! కరుణాబ్ధి! వారిజాక్ష!

7. జానకీ మనోహర హస్త! శౌర్యధుర్య!
కలువరాయని సొబగారు గాత్రవిభవ!
రావణాసుర తిమిర విరామ శోభ!
శరణు రఘురామ! మహనీయచరితచరణ!

8. విమల మానస! శ్రీపతీ! విబుధ వినుత!
సుభగ దేహ! భక్తవరద! సులభసాధ్య!
దివ్యశర! రఘుకులరాజ!ధీరవర్య!
భక్తి నుతిఁజేతు నిన్గూర్చి భానువంశ్య!

9. వేంకటేశ్వర! నీకంటె వేరులేరు
ఎల్లవేళల ధ్యానింతు నుల్లమలర
నీవె నాదిక్కు! శ్రీహరీ! నిర్మలాత్మ!
దయఁ బ్రసన్నుఁడవగుమయ్య! ధర్మరక్ష!

10. నీదు పాదపద్మములను నెమ్మిఁజేరి,
సేవఁజేతునుసద్భక్తి శిరము వంచి
నిత్యసేవల ఫలమిమ్ము. నిర్మలాత్మ!
పరమపదవిభవ! వరద! పద్మనాభ!

11. దోషములు చేసితిన్నేను దొసఁగు మతిని,
జ్ఞాన హీనుండనై పాపజన్ముఁడైతి.
పరమ గతిలేదు! నాకింక; పద్మనాభ!
పాప పుంజముల్ మన్నింపు! భవవినాశ!
శేషశైల శిఖామణీ! శ్రీహృదీశ!

# 3. శ్రీ వేంకటేశ్వర ప్రపత్తిః

1. లోకమాతవు, శౌరిప్రేమైక సతివి,
విభుని వక్షాన నెలకొన్న విమల మతివి,
విష్ణు నోర్పును బోషించు విబుధ నుతవు,
పద్మభూషిత పల్లవ పాణియుతవు,
కమల నిలయవు, కరుణాది విమల గుణివి.
వేంకటేశ్వరీ! నినుఁగొల్తు! విశ్వమాత!

2. శ్రీధర! కరుణాబ్ధి! కృతవిశేషలోక!
సర్వగుణ సమర్థ విభవ! సాధురక్ష!
సర్వలోకైకదేవ! విశాలహృదయ!
శ్రీశ! నీపాద శరణంబుఁ జేరఁగొలుతు.

3. దేవ! అనూపు రార్పిత దివ్యపుష్ప
పరిమళంబులు మదిఁగూర్ప పరిమళింప
సంతతంబు మనోహర సౌమ్యమైన
శ్రీశ! నీపాద శరణంబుఁ జేరఁగొలుతు.

4. విచ్చు కుంకుమ కాంతులు వెడలు తమ్మి
పొలకువలుఁ, గూర్చు నీపాద భూతి శోభ
సారస సమానమని చెప్ప సాహసంబె!
శ్రీశ! నీపాద శరణంబుఁజేరఁగొలుతు.

5. భవ్యమైనట్టి రేఖల పరిఢ విల్లు
ధ్వజ సుధా కలశచ్ఛత్ర వజ్రములను,
నంకుశంబును, బద్మంబు నమరతరులు
శంఖచక్రాది సౌభాగ్య సరళినొప్పు
శ్రీశ! నీపాద శరణంబుఁజేరఁగొలుతు!

6. చెన్నులీను పాదతలాల చిత్రకాంతి
గరుడపచ్చల రాగాలు గ్రమ్ము కొనియె.
బాహ్యపాదద్యుతుల్ మించె భవ్యకాంతి-
ఇంద్ర నీలపు కాంతుల నెల్ల గెలిచె.
చరణ నఖశోభ మించెను చంద్రశోభ.
శ్రీశ! నీపాద శరణంబు జేర గొలుతు.

7. చిగురు జేతుల శ్రీదేవి చెలిమి నొత్తు
కందు నను భీతి చరణాలు కంసహనన!
సౌకుమార్యంబు నుడువంగ జాల సుభగ!
శ్రీశ! నీపాద శరణంబు జేర గొలుతు!

8. శ్రీయు, భూ, నీళ దేవులు సేవ జేయ
సతుల కరపల్లవారుణ స్పర్శవలన
అరుణవర్ణాన విలసిల్లె చరణయుగళి,
శ్రీశ! నీపాద శరణంబు జేర గొలుతు.

9. ప్రత్యహంబును సేవింప భవ్యులైన
వేధ, శంకరాదులు నిన్ను వేడవచ్చి
రాజిత కిరీటరత్న నీరాజనమున
వందనాలిడిరి శిరాల సుందరముగ.
శ్రీశ! నీపాదశరణంబు జేర గొలుతు.

10. నియతి "విష్ణోఃపదే పరమ" యని నుడువ
"మధ్వఉత్స" నా శ్రుతి నొప్పె మహితనుతుల
చేత జూపుదువివె యంచు చిద్విలాస!
శ్రీశ! నీపాదశరణంబు జేర గొలుతు.

11. నరుని సారథ్యమందునె శరణమొంద.
చేత చరణముల్ జూపెడి శేషయన!
నేటికిని "శరణంవ్రజ" నీతి జాటు
శ్రీశ! నీపాదశరణంబు జేర గొలుతు.

12. నాదు శిరమందు కాళియు మీద మిగుల
దుర్గమారణ్యా శేషాద్రి దుర్గములను,
వేద శిరముల, యోగీశ హృదయములను,
సమముగ మోపి గాచిన సరళగతులు,
శ్రీశ! నీపాదశరణంబుఁజేరఁగొలుతు.

13. వాడని విరుల భువి ఁజల్ల వరలినట్లు
వేంకటాద్రిని భూషించు విధిని నెగడి
మదికి కంటికి నింపును ముదముఁగూర్చు
శ్రీశ! నీపాదశరణంబుఁ జేరఁగొలుతు.

14. ప్రీతి సేవించు భక్తుల పెన్నిధియన,
తల్లిపాలిండ్లు శిశువులఁదనుపురీతి,
తుల్యమై పరస్పర సౌమ్య దోహలమగు
శ్రీశ! నీపాదశరణంబుఁ జేరఁగొలుతు.

15. సాధుజనసేవ్య సందీప్త చరణపద్మ,
మోహ సంసార తారక ముదిత నేత్రు,
సౌమ్యజామాతృముని చేత గమ్యమైన
శ్రీశ! నీపాదశరణంబుఁజేరఁగొలుతు.

16. శ్రీశ! నీవుఁజూపెడి ముక్తి సిరియుఁజూపు-
పొందఁ గోరిన నినుతానె పొదువు కొనఁగ,
చెలఁగు చుండెడి శ్రీలక్ష్మి చేరి కూర్మి
సద్గుణంబుల నొప్పు వృషాద్రి నాథ!
నిన్నె సేవింప నెంచెద నీరజాక్ష!

# శ్రీ వేంకటేశ మంగళాశాసనము.

1. సర్వకల్యాణ గుణనిధి సదయునకును,
హరికి, కమలాపతికి, శరణార్థి ఖనికి,
వేంకటాచలవాసికి, విశ్వపతికి,
సర్వజయ మంగళం బగు నుర్వీపతిక!

2. సకల లోకాల నేత్రమౌ సత్యమూర్తి,
శ్రీ రమాలోల నయన విశిష్టగతుఁడు,
అర్థిజనకల్పమభిరాముఁడచ్యుతుండు,
మాధవుఁడు సర్వమయునకు మంగళంబు!

3. సిరుల నొప్పెడి శేషాద్రి శిఖర వసతి
మంగళాభరణంబుగ మసలు తండ్రి,
పాద పద్మ భూషిత భవ్యహరికి,
మంగళావాస వరదునకు మంగళంబు.

4. సర్వ సౌందర్య సకలాంగ సంపదలను,
జనులనెప్పుడు సమ్మోహ జలది ముంచు
వేదవేద్యుఁడు, శ్రీహరి, విశ్వపతికి,
విష్ణుమూర్తికి మంగళ విజయగీతి!

5. నాశ రహితుఁడు, నిర్దోషి నగధరుండు,
సచ్చిదానంద చిత్తుఁడు, సత్యపదుఁడు,
చక్రి, సర్వాంతరాత్ముఁడు, సాధునుతుఁడు,
విష్ణువరునకు మంగళ విజయగీతి!

6. సహజ సర్వజ్ఞ శక్తుల సత్యమూర్తి,
సర్వమునకు, ప్రథముఁడైన శౌర్యధనుఁడు,
సులభుఁడు, సుశీల నిలయుండు, సుందరుండు,
మహిని గాచిన హరికెప్డు మంగళంబు!

7. బ్రహ్మ రూపాన వెలుగొందు పరమగురుఁడు
పూర్ణకాముండు, పరతత్త్వ పుణ్యమూర్తి,
విపుల పరమాత్మ రూపుండు, విష్ణుమూర్తి,
మత్స్యమూర్తికి, హరికిదె మంగళంబు!

8. కాలతత్త్వ పర్యంతముఁ గనినఁగాని
ప్రాణికోటికి! సంతృప్తి ఫలముఁగలదె!
అమృత సద్రూప శ్రీకర! అమరవినుత!
భక్తకల్ప! మంగళ మిదె భవవిదూర!

9. సతతమును గొల్చు భక్తాగ్ర వితతి కెపుడు
పరమ శరణంబె యంచును పాదయుగళి
హస్త సంజ్ఞనుఁ దయఁ జూపు నచ్యుతునకు
మంగళము వేంకటపతికి మంగళంబు!

10. కరుణయను తరంగామృత పరమనదిగ
శీతలంబిడు కడకంటి సేవనమున
విశ్వమంతయుఁ దడిపిన విమలునకును
మంగళం బిదె! శౌరికి మంగళంబు!

11. అంబరాది విభూషణా లమరియుండు,
దివ్య మంగళ శోభిత దేహునకును,
సర్వదోష నివారణ సదయునకును
మంగళం బగు గాక! జై! మంగళంబు!

12. రమ్య వైకుంఠ పురవాస రక్తినుడిగి
స్వామి పుష్కరిణి తటిన్ సరసగతుల
రమను లీలల రమియించు నమరమణికి,
చక్రధరునకు మంగళాశాసనంబు!

13. సర్వ లోకాల, వేదాల, చదువులందు,
భక్తహృదయాల పాండిత్య పదములందు,
రమ్య జామాతృ హృదయాన రమణ నుండు,
చక్రధరునకు మంగళాశాసనంబు!

14. మంగళాశాసనముఁ జేయు మాన్యులకును,
గురుగణంబుకు పూర్వసద్గురువులకును,
సర్వజనముల పూజల సరవిఁగనిన
చక్రధరునకు మంగళా శాసనంబు!

శ్రీ వేంకటేశ సుప్రభాత అనువాదము పరిసమాప్తము

ఓం లక్ష్మీ నారాయణాయ నమః

# నివేదనము

1. ఉ॥ శ్రీ రమణీ మనోరమణు, శేషగిరీశు, సురాళి సన్నుతున్,
భారత వీర ధర్మవిదు, భక్తజనావన కల్పశాఖియున్,
నీరజలోచనున్, వరమునీశ్వర సేవిత పాదపద్మునిన్,
సారమతిన్, నుతింతు మనసారగ వేంకట సార్వభౌమునిన్.

2. ఉ॥ ఆలను గాచినట్టి సరసాంచిత లీలల నొప్పు శ్రీపతీ!
పాలను వంశనాశక విభాసుర ధర్మ పదాంచి తాధిపా!
శీల విరాజితంబు రససేవిత సాహితిఁ జక్క నొప్పగా
బాలనఁజేయుమయ్య! మముఁ బాయనిరక్తిని వేంకటేశ్వరా!

3.ఉ॥ లోకములెల్ల నుల్లసిలు లోకజనావన! కంస మర్దనా!
వాకొన జాలనయ్య! హరి! వైరి గణంబుల జృంభణంబులన్
వీకను వారి నొంపగను వేగమ కావగరావ! శ్రీకరా!
మాకిక ముక్తి నీయవ! రమాధవ! భక్తజనావనాధిపా!

4.శా॥ శ్రీ లక్ష్మీ హృదిచోర! దివ్యవినుతా! శేషాద్రి శృంగాధిపా!
లీలా మానుష విగ్రహా! మహిత సంలీలాత్మ విద్వత్ప్రభా!
కాలజ్ఞత్వ విధాన సచ్చరిత నాకాధీశ! సంపూజితా!
సాలంకార! వికాస! వేంకటవిభో! సద్భక్తి నిన్గొల్చెదన్!

5. చ॥ సరస కథాప్రకార సవిచార ప్రవర్తన నర్తనాన్వితా!
పరమ రమాహృదీశ్వర ! విభాసుర దివ్యమహేశ్వరార్చితా!
కరము వినమ్రతన్ గొలుతు కర్మములన్నిఁటిబాపి కావవే!
వరముని భక్తదాసగణ వందిత సత్త్వవిభుత్వశ్రీహరీ!

6. ఉ॥ నిర్మల మానసాంబుధి వినీతి విరాజిలఁ గోరు మమ్ములన్
ధర్మపథంబు లెప్డు వసుధన్ జయసంపద రాజిలన్ ప్రభూ!
మర్మములెల్ల దెల్పి మము మానిత మార్గులఁగాగఁ జూడుమా
కర్మలు ధర్మమార్గములు గాంచఁగ బోధనలన్ సుధీస్తుతా!

## శ్రీ వేంకటేశ నక్షత్రమాల

1.శా॥ శ్రీవత్సాంకిత! శేషశైల నిలయా! శ్రీ పద్మినీ వల్లభా!
గోవిందా! సుజనావనా! మురహరా! గోపాల సద్భక్తి నిన్
సేవించన్ మది నెంచి పద్యరచనన్ చెన్నొందు భావాలతో
గావ్యంబున్ రచియింపఁ బూనితి నిదే కారుణ్యమున్ జూపవే!

2. సీ॥ అలనాడు దేవతాలార్తనాదము తోడ
రక్కసు లొనరించు రగడఁదెలుప
మత్స్యాది మూర్తుల మార్పుల భువిజొచ్చి
ముష్కర సంతతి మొదలు ద్రుంప
పనిబూని జగతిని బాలింప దయతోడ

అవతరించితి వీవు అబ్జనేత్ర!
నీదు దీక్షను గాంచి నిర్జరు లెల్లరు
నీరాజనము నీకు నెమ్మి నీయ

గీ॥ సాధుజన తోష! దివిజారి సన్నుతార్య!
భువిని పాలించు చున్నావు భువనవంద్య!
వందనంబులు జేకొను వరముకుంద!
విజయ మొసగుమా! దయతోడ వేంకటేశ!

3. సీ॥ శేషాద్రి నిలయ నీ సేవలుజేయగ
సద్భక్తి నినుజేరు సయమములను
మోసముల్ జేతురు మూర్ఖులు కొందరు
తీర్థుల రక్షింప తెఱగు గనుమ!
ఎఱిగి యుందువు నీవదెట్టి మూర్ఖుల నైన
చక్కజేయుము వారి చనువుతోడ.
కాలమహిమ చూడ కలికాల మియ్యది
ధర్మహానిని నేను దాచలేను.
గీ॥ చెప్పుకొంటిని నీ యొక్క శిశువు నగుట
ముప్పులెల్లను బాపుమా! ముక్తిదాత!
ఆర్తజన కల్పమైనట్టి అర్హవంద్య!
ఆదరంబున బ్రోవుమా! అమర వినుత!

4. మ॥ తిరుచానూరున నుండు వేంకట సతీ ధీయుక్తి నిన్నెప్పుడున్
పరమానందవిధిన్ భజింతు సుమతిన్ పద్మావతీ బ్రోవుమా!
సురలెల్లన్ వినుతింప లక్ష్మివగుటన్ సొంపొందు శ్రీ వేంకటే
శ్వరు విష్ణున్ బతిగాగ నెన్నితివహో!వాత్సల్యసంధాయినీ!

5. చ॥ తిరుపతి శైలమందు నతిదీక్షను వాసముఁజేయు శ్రీపతీ!
కరమరుదైన వైభవము కన్నుల పండువ గూర్చు వేడుకల్
జరుగుచునుండు నీకెపుడు సజ్జన పోషక వేంకటేశ! శ్రీ
కరమగు నీ మహామహిమ లెంచుచు నంజలి ఁజేతుమాధవా!

6. సీ॥ పచ్చనౌ నీపుర ప్రాంతమ్ము లరయగ
పన్నగేశుని రూపు బయలుపడియె.
నీలమౌ నీ రూపు నెమ్మితోఁ గాంచగ
వెన్నుడంచును నాకు విశదమయ్యె.
ఆభరణంబులు నారయ మదినాకు
శంఖ చక్రాదుల శంకతీరె.
పద్మావతీ దేవి పరికింపఁగ నాకు
విష్ణుపత్నిగ నాకు విశదమయ్యె.
గీ॥ చిత్ర మియ్యది నీ మాయ శేషశయన!
భక్తులెల్లరు గోరెడి ఫలము లీయ
చెలఁగి యున్నావు తిరుమల క్షేత్రమందు.
వినుతిఁజేయుదు నిన్నెప్డు వేంకటేశ!

7. ఉ॥ వ్రాయగఁ బూనితిన్ గవిత వాసవవందిత! వేంకటేశ్వరా!
తీయని భావసద్రచన దిట్టతనంబది కల్గుటెన్నడో?
వేయి విధంబులన్ వినుతి వేడుక లొప్పెడు కొన్ని పద్యముల్
వ్రాయఁగఁ జూడుమా! దయను భక్తులఁ గాచెడి వేంకటేశ్వరా!

8. ఉ॥ అరయ కుంటి నీ మహిమ నర్మిలి వేంకటరాయ యైన నీ
కారుణిక స్వరూపమును గాంచుచు వ్రాసెద భావబంధముల్
తీరని భక్తితో వరద! తీయని యూహల నందజేయుమా!
శ్రీ రమణీయ శోభలను శ్రీపురి నొప్పెడి వేంకటేశ్వరా!

9. ॥ లోకపు నాటకంబున విరోధి విలుంతన ససూత్ర ధారివై
లోకము లన్నిటన్ దిరుగు లోక జనావన కంసమర్దనా!
ప్రాకెను నీ మహత్త్వము శుభాన్విత దృక్కుల విశ్వమంతటన్
వా కొనజాల! నీ మహిమ వారిజనాభ! భవాబ్ధిఁదేల్చుమా!.

10 ఉ॥ వాసుకియైన నీ మహిమ వాకొనజాలడు సర్వమున్ ప్రభూ!
వ్యాసము రీతి నీచరిత వ్రాసెద నిప్పుడు చిన్ని మాటలన్
గాసిని బాపి నీ నిసుఁగు గావవె? మ్రొక్కెద. ధూర్తసంహరా!
దోసము లన్నిటిన్ దొలఁచి దుఃఖముఁబాపుము. వేంకటేశ్వరా!

11.ఉ॥ నాటక సూత్రధారి వని నారదుడెల్లడ పాడుచుండుటన్
నీటగు నీ కథల్ దెలిసె నిర్మల భక్తులకెల్ల కేశవా!
ఏటికి మాధవా! కదల కిట్టుల నుంటివి! పర్వతంబునన్
పాటులఁజూచిమమ్ము దయఁ బాలనఁజేయుము.వేంకటేశ్వరా!

12. ఉ॥ఆకటనుండు నీ సుతుల హా యను నాదము లాలకింపవే
ప్రాకట భక్తిఁగొల్చు మము పాపము లన్నిట నుండి గావవే!
శ్రీకరమైన నీ భజన జేసెడి దీనుల బాధఁ దీర్పవే!
నీకిదె వందనం బిడెద నెమ్మిని గావుము, వేంకటేశ్వరా!

13. ఉ॥ఉత్సవ వేళలందు జనులుత్కట భక్తిని యాత్రలందునన్
కుత్సిత బుద్ధి కొల్లఁగొను క్రూరుల నొంతువు ధర్మరక్షణన్
వత్సలతన్ వినీతులను పాయకఁ గాచెది నాకసన్నుతా!
ఉత్సుక బుద్ధి నిన్గొలుచు నున్నతి నీయవ! వేంకటేశ్వరా!

14. ఉ॥శ్రీపురశైలమందు నొకచెంతను పుట్టను నుండి నట్టి నీ
రూపునుగాంచి దుగ్ధమిడి ప్రోచెడి గోవును గొట్టినట యా
గోపుని శాపతప్తునిగ కూర్చియు వానికి ముక్తి నిచ్చి తా
పాపులఁ గాచు నీ చరిత పావన మైనది వేంకటేశ్వరా!

15 ఉ॥ భక్తుల బాధలన్ తొలఁగ పాయని భక్తిని మొక్కులీయగన్
యుక్తములైన వారి కురులొందుచు తృప్తిని బొందెదయ్యనీ!
శక్తిని వారి ముప్పులను చప్పున నూడ్చెదవయ్య! శ్రీహరీ!
భక్తుల కేశముల్ బడసి భద్రము లిచ్చెడి వేంకటేశ్వరా!

16. ఉ॥దీక్షను బూని దేవతలు దీపిత కీర్తనఁ బూజఁజేయగన్
దక్షుఁడవై భువిన్ బొడమి ధర్మము నుద్ధరణం బొనర్చితొ
అక్షయమందె వంశము నిశాటుల బాధలనుండి నీదయన్
పక్షిగణేశవాహనుఁడ! భక్తి నుతింతును. వేంకటేశ్వరా!

17. ఉ॥నీలి మెఱుంగులన్ వెలయు నిశ్చల రూపున రత్నశోభలన్
పూలసరంబులన్ చెలగ పూజల మంత్రములందుచున్ సదా
మేలగు వస్త్రముల్ బడసి మించుల మించెడి శ్రీ మనోహరా!
పాలనఁ జేయుమయ్య! మము పాపములన్ని తొలంగ మాధవా!

18. ఉ॥సప్తమ శైలమందున ప్రసారిత శోభల ముక్తిదాతవై
ఆప్తుల కల్పకంబవయి యాలయ మందున దివ్యమూర్తివై
ప్రాప్తయ శస్సులన్ వెలయు భక్తజనార్చితపాదవైభవా!
సప్తమ శైలవాస! నిను సన్నుతిఁ జేసెద. వేంకటేశ్వరా!

19. ఉ॥వేడుక లొప్పు నీవసతి వీక్షణ భాగ్యములందగన్ జనుల్
వేడుచు కష్టమెంచకయె వేగిరపాటున పర్వతంబులన్
పాడుచు నాడుచున్ గడచి పాప వినాశుఁడవైన నీపురిన్
గూడుదురయ్య! నీ సొబగు గూర్చెడి మూర్తిఁ గనంగ శ్రీహరీ!

20. ఉ॥వేంకటరాయ నీస్తవము వేంకటమౌను నిజంబు మాధవా!
పంకజనాభ! నీ పదము ప్రాభవ మిచ్చును భక్తపాళికిన్
గొంకక గొల్చు వారలకు కోటి యుగంబుల సౌఖ్యమబ్బు శ్రీ
వేంకటరాయ! నిన్గొలుతు వేయి విధంబుల! వేంకటేశ్వరా!

21. ఉ॥గంటల శబ్దముల్ ఖలుల గర్వములెల్లను బాఱఁదోలగన్
మింటను నుండు దేవతలు మిక్కిలి భక్తిని మేలు కొల్పగన్
తంటలు మాన్పగన్ త్వరగ దక్షత నందుమ! సాధు పోషకా!
కంటికి రెప్ప పోల్కి మముఁ గావగఁజూడుము! వేంకటేశ్వరా!

22. ఉ॥ఆదియుగంబు నుండి యిల నాదర దృక్కుల రక్షణంబుకై
వేదము లన్నిటిన్ వెదకి వేధకుఁనిచ్చిన వేల్పు నీవెగా
మోదము తోడ నీకు కయి మోడ్పుల మొక్కెద విశ్వదర్శనా!
సాదర భావముంచి నను చల్లనిచూపులఁబ్రోవుమా! హరీ!

23. ఉ॥రావణహంతకున్ సమరరంగమునందున సంహరింపవే
గోవులఁ గాచుచున్ కొలని క్రూరపు కాళియు గర్వమూడ్చవే
భావజ వశ్యలౌ చెలుల పండువు గూర్పవె గోకులంబునన్
కావరు లౌ కుమార్గులను గాసిని బెట్టవె! వేంకటేశ్వరా!

24. ధ్రువకోకిల॥ పరమపౌరుష! రాక్షసాంతక భవ్యకీర్తన శ్రీ కరా!
వరమునీశ్వర! యాగరక్షక! వందనంబులఁగొల్చెదన్.
కరుణతోడను సూనుఁడౌనను గావఁజూడుము శ్రీహరీ!
తిరుపతీ! పుర్శైల వాసుఁడీ! తీర్చుదిద్దుము శ్రీహరీ!

25. ఉత్సాహ॥ శ్రీకర నిను నుతి యొనర్తు శిష్టకవిత నందగన్
నాకవాసవినుత నిన్ను నా కృతితతిఁ గొల్చెదన్.
శ్రీకరా! భవాబ్ధిఁదేల్చి సేవ కాళిఁ బ్రోవుమా!
వాకొనెదను. వేంకటేశ! వరములిమ్ము! మాధవా!

26. ఉ॥హాయిని గూర్చునీ విమల యాకృతిఁ గాంచుచు వ్రాయఁగల్గితిన్
పాయని భక్తి పద్యముల భాగ్యుఁడనైతిని, మోదమందితిన్
తోయజనాభ! నీ మహిమ దుర్జన సంతతి రూపు మాపెడిన్
వేయి విధంబులన్ గొలుతు వేంకటరాయ! వినమ్రవాక్కులన్

27. పంచ చామరము ||

జనర్దనా హరీ! పునీత సాగరా! శుభంకరా!
అనాథ రక్షకా! కుమార్గ హంతకా! శివంకరా!
అనారతంబు వేడు నీదు అర్చకున్ క్షమింపుమా!
వినూత్న పద్యముల్ రచింప వేంకటేశ! చూడుమా!

1. ఓం మంగళమ్ గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ సాధు రూపాయ మంగళమ్||

2. మంగళమ్ శ్రీకురుక్షేత్రే రణక్షోణీ విహారిణే
పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళమ్||

ఓం తత్ సత్

ఓం నమో సాయినాథాయ
శ్రీ హితసుధాంశువు.

# తృతీయార్థము

# షిరిడి ఆరతులు

మరాఠీలోని
ప్రమేయా అష్టకాశీ కీర్తన.

కృతికర్త
శ్రీ కృష్ణ జగదీశ్వర భీష్మశాస్త్రి
1908 శ్రావణ మాసము ఆధారముగ.

ఆంధ్రానువాదము
విద్వాన్ ముచ్చేలి శ్రీరాములు రెడ్డి,

## ఓం నమః శ్రీసాయినాథాయ

గోదావర్యాః ప్రవాహో విల్లసతి యదుదక్ పార్శ్వతో యోజనైకమ్
ప్రాదుర్భూత్వాఽఽత్మ భూత్యాఽనిశ జనితమ హే శీలధీక్షేత్రధామ్ని
సర్వజ్ఞాతీయ వృందైర్వివిధ జనపదా దాగతైస్తూయ మానః
పూర్ణబ్రహ్మైవ సాక్షాద్విజయతి భువనం పావయన్ సాయినాథః॥

గోదావరి నది కుత్తర భాగముననొక యోజన దూరమున శిలది (షిరిడి) అను క్షేత్రమున ఆత్మైశ్వర్యముతోసర్వజ్ఞానుల చేత వివిధ భక్తులచేత స్తుతింపఁబడుచున్న పూర్ణబ్రహ్మ స్వరూపుడగు శ్రీ సాయినాథుఁడు సాక్షాత్కరించి భూమండలమును పావనము చేయుచున్నాడు.

## శ్రీసాయిబాబ ఏకాదశ సూత్రములు.

1. షిర్డీప్రవేశము సర్వదుఃఖ పరిహారకము.
2. అర్హులైన నేమి నిరుపేదలైన నేమి ద్వారకామయి ప్రవేశ మొనరించినంతనే సుఖసంపదలుఁబొందఁగలరు
3. ఈ భౌతిక దేహానంతరము నేనప్రమత్తుఁడను.
4. నాభక్తులకు రక్షణంబు నా సమాధి నుండియే వెలువడు చుండును.
5. నా సమాధి నుండియో నా మనుష్య శరీరము మాట్లాడును.
6. నన్నాశ్రయించిన శరణుఁజొచ్చిన వారిని రక్షించుటయే నా కర్తవ్యము.
7. నా యందెవరి దృష్టియో వారియందే నా లక్ష్యము.
8. మీ భారములను నా పై బడవేయుడు. నేను మోసెదను.
9. నా సహాయము గాని నా సలహాను గాని కోరిన తక్షణమొసంగ సంసిద్ధుడను.
10. నా భక్తుల యింట లేమి యను శబ్దమే పొడసూపదు.
11. నా సమాధినుండియే నేను సర్వకార్యముల నిర్వహింతును.

# కృతికర్త

ముట్టుఁబాల జల్లు మహాత్ము ముద్దుమాట,
తల్లిమది వెన్నముద్ద! మా తండ్రి మనసు.
పుడమి నిబ్బర మురమొప్పు కడిది వేల్పు.
శాంతిబాటకు నెలవైన సాయిఁగొలుతు. ౧

ఇమ్ముగ వెలయు ముచ్చేలి యింటివారు
వర చినక్క చెంగారెడ్డి భవ్య గుణులు.
ధర్మవర్తనఁజనెడి యాదంపతులకు
సుతులు ముర్వురు మఱియొక సుతయుఁ గలదు. ౨

నల్వురందున శ్రీరామనామ సుతుఁడ
విమల బోధముపాధ్యాయ వృత్తి నాది.
మా నివాసము గాజులమండ్యమనెడి
స్వర్ణముఖినదీ సన్నిధి సత్పురంబు. 3

వేంకటాచలపతి సేవ విశదపఱచి
సాయి కాగడా హారతుల్ సంతరించి
విఘ్న నాయక శతకంబు విమల మతిని
వ్రాయఁదొడఁగితి శ్రీపతి సాయిదయను. ౪

*విద్వాన్ ముచ్చేలి శ్రీరాములు రెడ్డి.*

# అంకితము.

శ్రీ కాగడా ఆరతులు

సచ్చిదానందమూర్తి శ్రీ మన్నారాయణాంశావతారమూర్తి
శ్రీ షిర్డిసాయి బాబా పాదారవిందములకు మనసార సమర్పితము.

ఊరు పేరు లేనట్టి పకీరు సాబు.
షిరిడి నేల వరాలిడు తిరిపిగాడు.
దాససేవాంకితోదాత్త ధర్మమూర్తి.
పలుకులందున తొలినుడుల్ కొలువుఁ దీరు
సద్యశోకాంత జయసాయి చంక బిడ్డ!

సృష్టి కారణ సంస్థిత శేష శయన!
సాంబశివ! సాయి! గురుదత్త! షణ్ముఖాంశ!
భక్తజన సర్వ సంతాప భంజనాత్మ!
హారతీ కృతి దేవ! నీ కంకితమ్ము!

విద్వాన్ ముచ్చేలి శ్రీరాములురెడ్డి

# ప్రార్థన

తే॥గీ॥ ఓం నమో వినాయక దేవ! ఓం స్వరూప!
ఓం ప్రణవమూర్తి! సాయీశ! ఉజ్జ్వలాత్మ!
ఓం త్రిమూర్త్యాత్మ! సర్వేశ! ఓం బుధాయ!
ఓం నమః పరమాత్మనే! ఓం శుభాయ! 1

తే॥గీ॥ సర్వ విఘ్నాల తొలగించు సదయమూర్తి!
చదువుసంధ్యల వెలయించు సాధురక్ష!
భవ్య తారక హృదయాత్మ! దివ్య పురుష!
పాహి మాం! సాయి! విఘ్నేశ! భక్త రక్ష! 2

తే॥గీ॥ భారతీదేవి! సంగీత శారదాంబ!
వేదసందీప్త తేజస్వి! విధు శుభాంగి!
సర్వ కార్యాల జయమిమ్మి! సరసిజాక్షి!
ఆయురారోగ్య భాగ్యాల! నరయుమమ్మ! 3

తే॥గీ॥ సర్వలోకాల సతతంబు బర్వినట్టి
దివ్య తేజస్వి! అచ్యుత! దివిజవినుత!
వేంకటేశ్వర! కలియుగ విపులతేజ!
నీదు పాదాల సేవింప నెమ్మిగనుమ! 4

తే॥గీ॥ అవతరింతువు లోకాల నరయు బుద్ధి.
యుగయుంగబుల ప్రజఁ గావ జగతిలోన
నీదు మాయల తెలియంగ నెవరి తరము?
వందనాలివె శ్రీహరి! వరద విభవ! 5

# శ్రీ షిర్డి సాయినాథుని వృత్తాంతము

తే॥గీ॥ శ్రీకరంబైన షిర్డిని చిన్నినాట
వెలసినాడొక బాలుండు విభవ విధిని,
అతని జన్మకు కారకు లరయలేము.
చిరుతనాటనె సంపూర్ణ చిద్విలాసి. 6

తే॥గీ॥ అచట ఖండోబ మందిర అర్చకుండు
`సాయి' యంచును స్వామిని సన్నుతింప
సాయి నామమె తిరమయ్యె సాధువునకు
శ్రీకరంబైన సాయిబా చెలగె మిగుల. 7

తే॥గీ॥ భక్తి భుక్తికి. నెలవైన భవ్య షిర్డి
సాయిబాబా నివాసమై సాగె సిరుల.
నింబ వృక్షంబునీడను నెఱపె తపము.
దివ్య గురుస్థానమని యెంచి తేజమొలుక. 8

తే॥గీ॥ జీర్ణమౌ మసీదున చేరి చిన్మయుండు
దివ్వెలన్ వెలిగింపగ దీక్షఁ బూని
భిక్షమెత్తును నూనెకై ప్రీతి జనుల.
నీట వెలిగించె దీపాల నిండుమతిని. 9

తే॥గీ॥ ఇట్టి మహిమలు వెలుగున నుట్టిపడుచు
సాయిబాబా ఫకీరుగ సాగెనంత.
సర్వమత సమతాభావ చతురుఁడగుచు
చాటె జనులకు సద్గుణ సరణి విధుల. 10

తే॥గీ॥ హృదయగతమగు దివ్యుఁ డై సదయమతిని
వివిధ రూపాల విలసిల్లె విభవుఁడగుచు
రామభద్రుని రూపాల ప్రేమమీర
భక్త మందారుఁడౌచును పరిఢవిల్లె. 11

తే॥గీ॥ ద్వారకావాసి దత్తావతారుఁడనగ
ప్రణుతి కెక్కెను సాయిబాబాఁ విభూతి
సాయిబ్రహ్మ సమాధియై సౌరులొలుక
``కొంగు బంగారమయ్యెను" కోటి ప్రజకు. 12

తే॥గీ॥ మంగళంబగు శ్రీసాయి మహితునకును
సర్వమంగళ కరునకు సాయికెపుడు
నిత్యమంగళ మగుగాక! నిపుణమతికి
మంగళంబగు సాయికి మంగళంబు. 13

ఓం నమో సాయిబాబాయ

# ముందొక మనవి .

ఒక్కొక్కప్పుడు మహనీయుల జన్మవృత్తాంతాలు తెలియకనే పోతుంటాయి. కొందఱివి తెలిసిన వారి బాల్య దశకు తదుపరి పరిణామ దశకు ఎంతో తేడా యుంటుంది. విచిత్రమేమంటే అంతుపట్టని జీవనం సాగించే వారి మహిమలు సామాజిక ప్రయోజనాత్మకమై యుంటాయి. అవి అనితర సాధ్యములు. వానిలో ఎట్టి దైవశక్తులు దాగియుంటాయో సామాన్యులకగమ్యము. అనంతమైన దయాపరమైన వారి గొప్పతనం చెప్పలేని భగవదంశ స్ఫోరక మగును. వీరు లోకులచే జీవితకాలంలోనే గాక వారి సమాధి-అనంతరం గూడ పూజింపఁబడుతారు. అర్థికోటి యార్తిని పోగొట్టుచుంటారు. అట్లనుటలో నతిశయోక్తి లేదు. అది సత్యం.

అట్టివారిలో శ్రీ షిరిడి సాయిబాబాను ఎఱుఁగని భక్తులుండరు. ``పువ్వు పుట్టగానే పరిమళించును గదా!" బాబా బాల్యము విచిత్రమైనది. ఆ మహనీయుఁడు పుట్టినది తెలియదు. కాని మెట్టినది మహారాష్ట్ర లోని షిరిడి అను క్షేత్రమందు. బాలఫకీరు నివాసము షిరిడి యందలి యొక మసీదు. షిరిడిసాయి ప్రవర్తన చూపరులకు వింతగ నుండెడిది. క్రమముగఁ నతని యదార్థ మహిమలు చాలామంది గ్రహింపఁగలిగినారు. వారు ధన్యులు.

బుద్ధుఁడు ప్రబోధితుఁడగుటకు బోధి వృక్షచ్ఛాయయే కారణమైతే షిరిడిసాయి దివ్యజ్ఞాన ప్రభావితుఁడగుటకు నింబ వృక్షచ్ఛాయ కారణమైనది. బాలయోగియైన శ్రీ సాయిని ఆనాటి వారు అలవాటుగా సాయిభయ్యా అని పిలిచేవారు. క్రమంగా

బాబా ఫకీరు పేరు "సాయిబాబా"గా స్థిరపడినది.

సాధారణంగా బాబాలమహిమలే వారి మహత్తును లోకానికంతను ప్రసరింపజేస్తాయి. దయాగుణ సింధువులు నిజమైన బాబాలు. శ్రీ సాయి తన వచనామృతముచే భక్త జన పాపకల్మషాన్ని పాఱద్రోలి వారిని పారమార్థిక చైతన్యవంతులుగా జేసేవారు. కేవలము శునకమును సైతము సహభోజనానికి సమ్మతించిన బాబా, సర్వప్రాణులపై గల భూతదయయును సర్వసమతా భావానికి నిదర్శనము. అది అనన్య సామాన్యమైన ప్రేమ. ఇటువంటి అమోఘమును ఆశ్చర్యమును గొల్పు విశేషములు బాబాయందు కోకొల్లలు.

ఇక నిరంతరం సమాజసేవా పరాయణులైన పుట్టపర్తి ప్రభాకరులు శ్రీ సత్యసాయి విశ్వజనీనత. నేడతని యాధ్వర్యమున నొక మహా సంస్థ నిర్వహింపబడుచున్నది. ఎందరో విజ్ఞానవేత్తలు సహితము అతని మహిమోపేతమైన కార్యములందలి అంతర్యమెఱుగకున్నారు. "సామాన్యుల దృష్టికి భగవల్లీలల గమ్యగోచరములు కదా"!

నిరంతరాయముగ నాధ్యాత్మిక సదస్సులు `శ్రీ పుట్టపర్తి సాయి సూక్తి' నిధానముగ భాసిల్లుచున్నవి. దేశదేశాంతర భక్తులు అతని శుశ్రూషలందుకొనుచున్నారు. సత్యసాయి దైవాంశ సంభూతులు. అందువలననే ప్రత్యక్షంగాఁ గొలువఁబడుచున్నారు.

అంతేకాదు శ్రీ సత్యసాయి వివిధ విద్యాలయాలు, వైద్యాలయాలను స్థాపించి పుష్కలమైన ఆర్థిక సంపత్తులతో

వానిని నిర్వహించుచున్నారన, అతని గొప్పతన మెట్టిదో ఊహించుకోవచ్చును.

ఇట్టి దయాసత్యమూర్తుల గన్నటువంటి యీ భారతము ధన్యము. అందువలననే ప్రపంచ దేశాల స్తవనీయమై, అపురూప ఆదర్శ దేశముగ నిది విరాజిల్లుచున్నది - మన దేశం.

పుట్టపర్తి హేమాహేమీలైన వైద్యులకు ప్రపంచవేందాంత వేత్తలకు, నిఖిల విద్యాపారంగత భక్తులకు నిలయ మైనందులకు శ్రీ పుట్టపర్తి సాయి యొక్క గొప్ప మనస్సును తార్కాణముగ జెప్పవచ్చును. ఆ మహానుభావునకు నమస్కరించని వారెవరున్నారు! ఈ సమయలో పుట్టపర్తి సాయి మహనీయునకు నావినమ్ర నమోవాకములు.

ఇక అమరమూర్తి షిరిడి సాయిబాబ సర్వసమతాభావము సర్వ భూతదయావిశేషములు ఆయనచరిత్ర వలన దెలిసి కొనవచ్చును. సమాధి గతుడయ్యు భక్తుల ఆర్తారావములాకర్ణించి వారి యార్తిని పోగొట్టువాడై వెలుగొందుచున్న విష్ణుమూర్తి శ్రీ షిరిడి సాయిబాబ.

ఎందరో భక్తులు తమ కవితాగానంతో ఆయనను గీర్తించినారు. సచ్చిదానందమూర్తి సంతృప్త హృదయుడునైన శ్రీసాయి దీవన లందుకొన్నారు.

తలచినంతనె భక్తుల కోర్కెలు దీరుస్తూ సర్వమతస్థుల వేలుపుగ గొలువు దీరియున్నాడు దివ్యమంగళమూర్తి సంతృప్త హృదయుడునైన సాయిబాబ.

శ్రీ షిరిడి సాయి యనుగ్రహమున 'శ్రీ కృష్ణ జగదీశ్వర భీష్మ' అను భక్తకవి మరాఠీ భాషలో శ్రీ సాయిని గూర్చి (అష్టకాళి) కాగడ హారతు లను పేరున సాయిస్తవమును రచించి శ్రీ సాయి పదముల కడ నుంచి సాయి మన్నలకు పాత్రుడైనాడు. తెలుగు లిపిలో లభ్యమైన మరాఠీ రచన నాధారముగ గొని, నాకుదోచిన రీతి తెనిగించినాను. మూలమును చదివినందున కవియొక్క వైష్ణవత్వము వ్యక్తమగుచున్నది. కాగడా హారతులకును, శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమునకును పోలికలు కాననగుచున్నవి

నేనుదీనిని పూజాపారాయణమున కనువగునట్లు వ్రాసియున్నాను. పండిత వర్యులు భక్తులు నాయీరచనయందలి బాగోగులు గ్రహించి దోషములున్న నాదృష్టికి తెత్తురని విన్నవించుకొంటున్నాను.

భక్తిప్రపత్తులతో

*విద్వాన్ ముచ్చేలి శ్రీరాములు రెడ్డి*

గాజులమండ్యం

శ్రీ రస్తు.

ఓం నమో విఘ్న రాజాయ!

తృతీయార్థము

# శ్రీ షిరిడి సాయిబాబా కాగడాఆరతులు.

ఉదయ కాలస్తవము.

(మేలుకొలుపు ఆరతులు)

ఉదయము గం॥5.15ని॥లకు దీపము అగరవత్తి పెట్టి వెన్న నివేదించి ఐదు వత్తులతో ఆరతినివ్వాలి.

(1)

1. కరములన్మోడ్చి చరణాల శిరము నుంతు
వినుము! నామొఱ పండరీ విఠల రంగ!
నిన్నుఁజేరిన దాసుఁడ - నన్నుఁ బ్రోవు!
సద్గురూ! కృపాదృష్టి ప్రశస్తిఁ గనుమ!

2. భక్తమందార! సాయీశ! భవ్యచరిత!
నీ పదాబ్జ సేవలఁజేయ నియమమొప్ప
శాశ్వత స్థాన మొసఁగు! నీ సరస నుండ!
నీ స్మరణ తుకారామాఖ్యు నియతిఁజేయ
తప్పులన్ సైచి పాపాల ముప్పు లణఁచి
నాదు భవబంధమును బాప నాదుకొనుమ!

(2)

3. పండరీ రంగ! లెమ్ము ప్రభాతమయ్యె!
దివ్యమంగళ దర్శన ధ్యేయ మడర
గరుడ గంబంబు సన్నిధిఁగ్రమ్ము కొనుచు
భక్తి భావాల నినుఁగనఁ బరమప్రీతి
వేద ఘోషల నున్నారు విప్రవరులు!

4. శ్రీ మహాద్వార పర్యంత సీమ నుండి
గరుడ టెక్కపుఁగంబము కడకుఁజేరి
అమర వరులెల్ల ముకుళిత హస్తు లగుచు
నిలిచియున్నారు నిను గాంచు నియమ విధుల.

(3)

5. శూల డమరుక ధారణ శోభ శివుఁడు,
భక్త శుక, సనకాది, సత్పరమ ఋషులు,
దివ్యనారద తుంబుర దేవ మునులు,
వచ్చియున్నారు నినుఁజూడ వరముకుంద!

6. కలియుగ మహానుభావుఁడు గాన సుధలఁ
దనిపె శ్రీనామ దేవుఁడు వినయమొప్ప,
శ్రీజనాభాయి నీపాదసేవ కొఱకు
నిన్ను దర్శించు నభిలాష నిలిచియుండె.

7. మేలు కొనుమయ్య సాయీశ! మేలుకొనుమ!
నీ పదాబ్జముల్ జూపుమ నీలవర్ణ!
వ్యాధి భవతాప పుంజాన బాధలొందు
మంద మతులము దేవ! మ మ్మాదుకొనుమ!

8. జన్మలన్ మాయ మిముఁజేర జంకునెపుడు
మందమతి మేము మాయలో మ్రగ్గినాము!
మాయ తిమిరంబు మాన్పంగ మాకు వశమె!
మీదు దర్శనమే మాకు మేలుఁగూర్చు.

9. భవతిమర వినాశక రవీ! పరమ తేజ!
అవగుణంబు లణంచి మమ్మాదుకొనుమ!
అజ్ఞతాంధము బాపి మాకభయ మిమ్ము!
సాయినాథ! మహారాజ! చక్కనయ్య!

10. నిన్నుఁ బొగడంగ శేషాహి నేరఁడయ్య!
మాదు వశమె! నినుఁ బొగడ మాన్యచరిత!
మేలుకొనుమయ్య సాయీశ! మేలుకొనుమ!
నీ పదాబ్జముల్ చూపుమా! పాపముడుగ.

11. భక్తులెల్ల సద్భావానఁ బరగు విధుల
ధ్యాన ముద్రితు నినుఁ గన ద్వారమందు
వేచి యున్నారు ముదమున వినుత భక్తి
త్వద్వచనసుధఁ గ్రోలఁగఁ దత్తసాయి!

12. సహన భావ! మాతృప్రేమ శాంతిశీల!
దీనబంధు! రమానాథ! దివ్యచరిత!
నీ కృపాదృష్టి సారించి నిబిడ కరుణ
మమ్ముఁ జూడుమా! షిర్డీశ! తమ్మికనుల!

13. తేనెపలుకుల తాపంబుఁ దీర్చుదేవ!
నిన్ను నొప్పింపఁ జాలము నిఖిలగమ్య!
సహన భావాబ్ధి! బాలకు చరిత వినవె?
దర్శనం బిమ్ము! దీనుని దరినిఁ జేర్చు!

14. అమృత వాణియె భవతాప మణంచు సుమ్ము!
సర్వరోగాపహారి యౌశక్తి దేవ!
కష్టమౌ నీమనస్సుకు మాగాథలెల్ల
సహన భావాన జగదీశు సహజకవిని
నీదు దర్శనశోభల నెమ్మిఁగనుమ!

15. మేలుకొనుమయ్య! సాయి! మమ్మేలుకొనుమ
ఆయురారోగ్య భాగ్యాల నమరఁజేయ
వ్యాధి భవతాప పుంజాన బాధలందు
మందమతులము! దేవ! మమ్మాదుకొనుమ!

**(4)**

16. తూర్పుదిశయందు భానుండు తొంగిచూచె.
లెమ్ము పండరీ పురనాథ! మమ్ముగావ!
నిదుర లెమ్మయ్య! సాయీశ! నిత్యతేజ!
నీదు దర్శన భాగ్యమ్ము నెమ్మి నిమ్ము!

17. మునులు సాధువుల్ నీ బస మూగినారు.
నిదుర వదలి దర్శనమిమ్ము! నిశ్చలాత్మ!
దర్శనోత్సుక హృదయాల తప్తులైరి!
ద్వారరంగ మండపమున ధర్మనిరతి!

18. దేవి! ఓరిఖుమాబాయి! దివిజనుతుని
నిదుర లేపుమ! నీవైన సదయమతిని!
గరుడ హనుమలు నినుఁజూడ పరగ వచ్చి
దివిని సురలెల్ల హారతుల్ భువికిఁ దెచ్చి
వైష్ణవాంకిత జ్యోతుల వరలినారు!
నిదుర వదులుమా! షిర్డీశ! సదయ హృదయ!

(5)

19. శ్రీ మహారాజ! సాయీశ! షిర్డినాథ! -
హారతీ పంచక మిడెద నందు కొనుమ!
సాయిరమకును హారతిన్ సరవినిడఁగ
చిత్తమొప్పగ ధ్యానంబుఁ జేతమిపుడు!
సాయి శ్రీదత్త పదసేవఁ జేయుదీక్ష
బంధువుల్ రండు! వేగమ భక్తినుతుల!

## (6) కాగడాహారతులు

20. శ్రీమహారాజ! సాయీశ! చిద్విలాస!
బాలకు లఘుసేవ గొనుమ! భవ్యమతిని!
కాగడా ఆరతిఁగొనుమ! కరుణ హృదయ!
దర్శనం బిమ్ము! చిన్మయ ధర్మతేజ!

21. శత్రుగుణషట్కకల్మష పాత్రమైన
మనసు హారతి వత్తిగా మనెడిరీతి-
తనర వైరాగ్య ఘృతమునఁ దడిపి మిగుల
సాయిభక్త్యాగ్ని వెలిగించి సాయి యట్లు
వెలుఁగు మనసు సద్గురు నట్లు వెలయఁజొచ్చె!

22. ద్వైత భావాంధకారము ధ్వంసమైన
జీవుఁడే పరమాత్మగ చెలఁగ సాగె,
హృదయకమలభూగగనాల నొదిగినావు.
సాయి! నీవె దత్తాత్రేయసత్యమూర్తి!

23. జీవకారుణ్యభావాలఁజెలఁగినావు
షిరిడి వెలుగొంది భక్తుల సిరులుఁగూర్ప
స్థిరనివాసమైనంతనే షిరిడిలోన
భక్తజనులెల్ల నినుఁజేరఁ బరుగులిడుచు
దివ్యశక్తుల ప్రజ బాధఁదీర్చినావు!

24. అయ్య! నినుఁబోలు నరుఁడేడి - యవని లోన?
దేవతత్త్వంబుఁదెలియంగ నీవెతగుదు
దివ్యరూపాన వెలసిన దేవ! నిన్ను
గాంచ భక్తుల వచ్చిరి కరుణఁబడయ!

25. తన్మయులఁ జేయు వాక్సుధఁ దనిపినావు!
భక్త జనకోటికల్పమై పరగినావు!
షిరిడి వెలసిల్లె పావనక్షేత్రమగుచు!
భక్తమందార! భవదీయపద విభూతి!

26. స్వాభిమానంబు విడిచిరి సాయిదేవ!
నీపదాబ్జసేవావిధి నిరతు లౌట
దాసులము, భక్తులము ఈశ! దరినిఁజేర్చి
ఆదుకొనుమయ్య! మమ్ముల నభయమొసఁగి
బాలకు లఘు సేవఁగొనుమ! భవ్యమతిని!
కాగడాహారతిఁగొనుమ! కరుణహృదయ!

(7)

27. పండి నిండిన భక్తిని భావనలను
కాగడాజ్యోతి పులకించఁగాంచినాము.
పంచప్రాణాల మాజీవభావనలను
ఆరతీరీతి నర్పింప నడరినాము.

28. పండరీనాధ! ఆరతిఁబట్టుచుంటి
ఆరతుల్ నీకు సాయీశ! ఆదుకొనుమ!
వందనంబులుఁగావింతు! వరముకుంద!
శిరము వంతు నీ పదముల కరముభక్తి!
నిన్ను కొనియాడ తరమౌనె! నిగమగమ్య!
బ్రహ్మహత్యల దోషముల్ బ్రద్దలవును.
సాయి! నీముఖదర్శన చర్యవలన!

29 నెమిలిపింఛ చామరముల నెమ్మితోడ
రాయి, రుక్మలు భవదీయ హాయి, గోరి
ఉభయ దిశలందు నిలుచుండి యొప్పిదముగ
విసరుచున్నారు! షిర్డీశ! విభవ తేజ!

(8)

30. హితవు గొన సాధు, సజ్జన హితులు లెండు
ఈ శరీరము నశియించు నెప్పుడైన!
పిదప తరియింప సాధన మొదవునెట్లు!
విఠలుచరణాలఁబట్టుడీ హితముతోడ!

31 . మొదటి సంధ్యాను విఠలుని మ్రొక్కుకొనుఁడు!
విఠలు నాశీస్సులందుడు విమల భక్తి!
పాదపద్మముల్ బట్టగఁబడయు ముక్తి!
విఠలునమృతంపు దృష్టుల వెలయఁ గనుఁడు!
భక్త జనతరణోపాయ ఫలముఁగనుఁడు!

32. లేచి కదలండి! వేగాన లీల లొలయ!
సాయి గుడిఁజేరఁ బోదము హాయి నంద!
ఆరతింబట్ట పాపాలు నంతరించు!
కూర్మి రుక్మిణీవర! మేలుకొమ్మవేగ!

33. దేవరాజవు నీవెకా! దివిజవినుత!
దిష్టి తీయించుకొమ్ము ఓ! దివ్యతేజ!
దృష్టిదోషము నశియించు దిష్టిఁదీయ.
షిరిడిసాయీ! మహోన్నత చిద్విలాస!

34. అదిగొ! బాజాభజంత్రీలు నద్భుతముగ
మ్రోగుచున్నవి ద్వారాన ముదము విరియ!
ఆరతులు బట్టగన్! మహాద్వారమందు!
శంఖభేరులుఁ బూన్చియు సంతసమున.
నామదేవుఁడు విఠలుని నయము మీర
పాదపూజలు జేసెను భక్తి వెలయ!

*(కర్పూరము వెలిగించవలెను)*

(9)

35. మాతృదేవ! సాయీగురూ! మౌనివర్య!
నీ పదాంతికాశ్రయ మిమ్ము! నెమ్మి మీర!
మాతృదేవ! దత్తాత్రేయ! మహిత - విభవ!
నీ పదార్చన భాగ్యంబునెఱయ నిమ్ము! ||2 సార్లు||

*శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహరాజ్ కి జై!*

# శ్రీ సాయినాథ ప్రభాతాష్టకము.

1. సుప్రభాత రవి శుభ మహాప్రదీప్తి.
సర్వజగతిని గగనానఁ బర్వసాగె.
ఎవ్వారీవేళ గురునామ మెంచునియతి
నట్టి వారికి కలిదోష మంటదెపుడు.

2. సద్గురు సమర్థసాయిని సంస్తుతింతు
కరములన్ మోడ్చి మనసార గురుని-
నా మనోవాంఛలన్ దీర్చుమో మహాత్మ!
సాయి జై! సచ్చిదానంద! సత్కృపాబ్ధి!

3. భానుఁడంధకారము నెట్లు పాఱఁద్రోలు
అట్లె మోహాంధకారము నణఁచు సాయి.
రవికి గురునకు సామ్యంబు భువిని గలదె?
రవి యణంచిన తిమిరంబు కవియు మరల.
సద్గురువు మోహతిమిరంబు సతము మాన్చు.
కరములన్మోడ్చి నిన్గొల్తు శిరము వంచి,
నా మనోవాంఛలన్ దీర్చుమో మహాత్మ!
సాయి జై! సచ్చిదానంద సత్కృపాబ్ధి!

4. భానుఁడుదయింప చీకటి పారిపోవు!
అట్లె దుర్నీతి నహమును నణఁచు గురువు!
త్వత్పదంబుల నాహృది దరిని నుంచు!
గురుని హరిహరాదుల పోల్చు కోర్కె తగదు!

5. గురువునకు లేరు సాటి యా గురువె యగును.
గొప్పవారికిన్ గురుభక్తి కూర్చు ఫలమ్ము.
నా మనోవాంఛలన్ దీర్చు మోమహాత్మ!
సాయి జై! సచ్చిదానంద సత్కృపాబ్ధి!

6. దురితదూర! అజాతశత్రుత్వహృదయ!
నీ సమాధి యందుండియె నెమ్మిఁగనుమ!
అయ్య! నీ వాక్సుధల మమ్మునాదుకొనవె!
పాపపుంజముల్ తొలగించి భద్రమిమ్మ!
శ్రీ మహారాజ! సాయిశ! చిద్విలాస!

7. సద్గురుసమర్థసాయినిన్ సంస్తుతింతు
కరములన్మోడ్చి మనసార గురుని నెపుడు!
నా మనోవాంఛలన్ దీర్చుమో మహాత్మ!
సాయి జై! సచ్చిదానంద సత్కృపాబ్ధి!

8. అదిగొ మేల్కాంచి కూర్చుండె నమరుఁడౌర!
పాదసేవక పాపముల్ పాఱఁద్రోల
ఇట్టి హితకారి జగతిలో నెవరు గలరు!
ఆశ్రితాళిని రక్షించు నమరగురుని
సద్గురు సమర్థసాయిని సంస్తుతింతు.
కరముల న్మోడ్చి మనసార గురుని నెపుడు.
నా మనోవాంఛలను దీర్చుమో మహాత్మ!
సాయిజై !సచ్చిదానంద సత్కృపాబ్ధి!

9. గురుకృపాపరతంత్రుఁడె గొప్పవాఁడు.
పరుని జీవితాకాంక్ష నిష్ఫలమ యగును.
కనునె? జీవిత సఫలంబు తనకుతానె.
నా మనంబె నీపదమని నమ్మి కొలుచు
భావన మదిలో నిలుపుమా! భక్తరక్ష!
సద్గురూ! సచ్చిదానంద! సత్కృపాబ్ధి!

10. శ్రీ మహారాజ! నాలో వసింపరమ్ము!
హృదయమందిరమున నుండ వేడుచుంటి!
విశ్వమంతయు గురువని విశ్వసింప
ఆత్మవిశ్వాసభావంబు లమర నిమ్ము!
లోకపావన సంస్కృతీలోలబుద్ధి
నొసఁగుమా! సాయి! షిరిడీశ! ఓంప్రకాశ!

11. బాలకవి కృష్ణుఁడష్టక పద్యకృతిని
వినయమొప్ప - గురనిఁజేరు విన్నపమున.
గురుపదంబుల నర్పింప గురువు పలికె!
దీని నెవ్వరు భక్తి విధేయ విధుల!

12. సుప్రభాతాన పఠనంబు శుచిగఁజేయు
నతని చిత్తవిభ్రాంతిని హతమొనర్తు.
నిత్య సత్య శాంతు లొసఁగి నెమ్మిఁగనెద.
ననుచు నభయ మిచ్చె మహాత్ముఁడాదరమున
సద్గురూ! సచ్చిదానంద సత్కృపాబ్ధి!

13. బిడ్డలము మేము దయతోడఁ బేర్మిఁగనుమ
విశ్వమే మిథ్యయను సత్యవిదుఁడవయ్యా! ||విశ్వమే||
విశ్వతోముఖుఁడవు నీవు వేదగమ్యా!
పిల్లలము మమ్ము పాలించు ముల్లమలర!

14. దాసుఁడేమని పలుకును ధర్మతేజ!
నోరు మెదపంగ లేనయ్యా చారుశీల!
విశ్వమే మిథ్య యను సత్యవిదుఁడ వయ్యా!
విశ్వతోముఖుఁడవు నీవు వేదగమ్యా!

15. సాయినాథ! కృపాదృష్టి సరగఁ గనుమ!
తండ్రియును సోదరుఁడవును దగుదువీవె! ||సాయినాథ||

16. అంధుఁడను దాస దాసుఁడనైతి నీకు
ఇంతకంటెను పలుకంగ నేమి కలదు!
ఏమి వచియింతు నాసామి ఎఱుక లేక?
దాసుఁడను నేను సత్యము దైవ మీవె!
నా కివేమి తెలియవు ప్రణామమయ్యా! ||సాయినాథ||

17. వ్యర్థమయ్యేను జీవిత పథము చూడ!
చివరి ఘడియల నీకంటె ఎవరుదిక్కు?
మీ మసీదు చీపురనైతి మిగులభక్తి!
సాయినాథ! నీవె పతివి జగము నేల! |సాయినాథ||

18. భోజ్యమేదని నేనిత్తు భువనవంద్య!
శ్రీ హరీ! మహారాజ! విచిత్రవిభవ!
దాసుఁడ బలహీనుఁడ నేను తమకుఁ దెలియు!
ఓ జగన్నాథ! ఎంగిలి యోగిరంబు
నీకు తగునయ్యా! జగదేకనిర్మలాత్మ!

19. ఎంత భక్తుఁడనైనను నిట్టి రొట్టె
నీ కొసంగఁగ నేనెట్లు నేర్తు తండ్రి!
దేవ! రాత్రి సగము దాటె! దివ్వెలూను
సమయ మయ్యెను. భక్తులెల్ల మధురంపు
భక్ష్యములనెన్నొ తెత్తురు భక్తినిడగ.

20. సద్గురు నీకంటె రక్షకుల్ జగతి లేరు.
బుద్ధిహీనత పతితుండ మూఢమతిని.
జగము నందున నీకంటె సాటి యెవరు?
నన్ను తరియింప నీకంటె యున్నవారె?
పాహి మాం! ఓం మహారాజ! పాహి పాహి!

21. శాంతి సహనాల మేరువౌ సత్యనిధివి!
ఈ భవాంబుధి తరియింప నీవె తగుదు!
గురువరా! పామరుండను కరుణఁజూడు!
వేగమే నన్ను రక్షించు! విబుధ వినుత!
అంధకార కూపభవమునందు నుండి
శ్రీ మహారాజ! సద్గురూ!చేదుకొనుమ!!

శ్రీ సద్గురు సాయినాథ మహారాజ్ కీ జై!!
*(పూలు చల్లవలెను)*

కాగడా ఆరతులు (ప్రాతస్తవము)
మొదటి భాగము
సమాప్తము.

ఓం

# గణాధి నాథాయ నమః

(రెండవ భాగం)

(మధ్యాహ్న హారతి 12 గం॥ ధూప దీప నైవేద్యానంతరము 5 వత్తులతో హారతి యివ్వాలి)

# షిరిడి మధ్యాహ్నహారతి

## ప్రార్థన

1. అందుకొనుమ! పంచారతి నమృత హృదయ!
బంధు జనులార! హారతిఁబట్టుకొఱకు,
సాయి భగవాను సేవలఁ జలుప లెండు!
రండు వేగమె శ్రీ సాయి రమణుఁగొలువ!

2. అచల భావన సేవింతు మమర వినుత
సాయి! దత్తేశ! మాధవ! సాయి! శివుఁడ!
మందమతులము నీ యండ మాకు రక్ష!
నీచరణసేవఁజేయఁగ నెమ్మిఁగనుమ!

**(2)**

3. సౌఖ్యమందార! హారతుల్ సరవిఁ గొనుమ!
సర్వజీవప్రదాతవు! చతురమతివి!
సంయమీశ్వర! మీదివ్యచరణధూళి
నా పయిన్ సోకనీయవ! పాపహారి!

4. హారతిన్ గొని సుఖము లొప్పారఁగనుమ!
రామ! భవదీయ పాదాబ్జరజము పఱచి
పాపముక్తుల గావింపు! పరమ పురుష!!
దాస జన బాంధవా! దేవ! దత్తసాయి! ||హారతిన్||

5. దత్త భావానుగుణ ఫలమిత్తువీవు!
హే! దయామూర్తి! నీ మాయ నెఱుఁగలేను. ||హారతి||
భావజాంతక! గుణభద్ర! భవ్యరూప!
కూర్మి గూర్తువు!మునిదృష్టిగోచరమున.
భవ్య గుణధామ! కారుణ్యభావ! రంగ! ||హారతిన్||
దివ్యపథదృష్టి సంధానతేజవిభవ! ||దత్త||

6. భవహరంబు భవన్నామభజన దేవ!
నీదు లీలలు గంభీరనిబిడగతులు! ||భవ||
దీన జన సద్గతినిఁ జూపు దివ్యనిధులు!
దీనజననాథ! సద్గురు! ధ్యానలోల! ||భవ||
||హే! దయా||

7. కలివినాశ! సంస్కృతిని వెలిసినావు!
సగుణ పరమాత్మ! దత్తాఖ్య నెగడినావు! ||హే దయా||
అష్ట దివసంబు గురువారమర్థి సతము
గురుపదార్చనఁ జేతురు పరమనిష్ఠ
భవభయంబులఁ బోఁద్రోలి భద్రమిడుమ!
సాయి పద సన్నిధానము సర్వదంబు! ||అష్ట||

(3)

8. భవపదనిధానసన్నిధి పరమపదము!
ఇదియె మా విన్నపము దేవ! యినకులేశ! ||అష్ట||
స్వాతి చినుకుల సేవించు చాతకంబు
నీ స్వరూప నీరము మాకు నిఖిలరక్ష!
నాదు విన్నప మాలించి యాదుకొనుమ! ||హారతి||

9. సాయి! దత్తావధూత! విజయము! జయము!
కరములన్ మోడ్చి శిరముంతు చరణములను
జయము! జయదేవ! మాధవ! జయము! జయము!
అవతరింతువు. ధర్మార్థ మవని యందు. ||సాయి||

10. నాస్తికాకర్షణాన్విత నయవిధాన!
ఆస్తికత్త్వాన నినుగొల్చు నాస్తికులును,
జయము! నీమాయ సౌమ్యంబు చతురతరము!
వివిధ రూపాల లీలలు వెలయుదేవ!
దీన జన రక్ష! నీనిత్య దివ్యచర్య! ||సాయి||

11. అవధరింతువు హితవృకై యవను విధుల
ద్వైతభావము విడనాడి ధర్మనిరతి.
యవనహైందవానైక్యత నణచి నావు!
సర్వమతములఁ గంటివి సదయమతిని.

12. దేవ! అవతరింతువు నరదేహమునను,
ఆత్మ తత్త్వమ్ము బోధింప నవని యందు.
గోపిచందుని మాంద్యంబు బాపినావు! ||సాయి||
త్వత్పదాభివందన మయ్య! దత్తదేవ!

13. మాయఁ దొలగించి కాపాడు! మమ్ము దేవ!
పాప మేఘాలఁ దొలగెడు పథముఁజూపి
సర్వజనులను బ్రోవుమా! సగుణ సరళి!
కష్టములఁబాపుమో ప్రభూ! కరుణతోడ!
మీ యశోమూర్తిఁ గొనియాడ సాయపడవె?
భీష్మ కవి కృష్ణ జగదీశు పేర్మిఁ గనుమ! ||సాయి||

(4)

14. షిరిడియే పండరీపురవరము నాకు,
సాయి వరదుఁడు శ్రీరంగ సామి నాకు,
విష్ణుమూర్తియె శ్రీసాయి కృష్ణుఁడరయ!
గాఢ భక్తియె చంద్రభాగానదంబు!

15. పుండరీకుండు నాభావ పుణ్యమూర్తి.
వందనమిడగ రారండి! వరదుఁ గొలువ
ముక్తి ఫలదుండు షిరిడీశు మొక్కుఁడనుచు
పాపముల్ బాపుమంచును పరమ భక్తి.
గణుఁడు పిలిచెను. శ్రీసాయికరుణఁ బడయ.

(5) నమనము

16. వందనము దేవ! సాష్టాంగ వందనంబు
నీపదంబులఁగొల్తును నీలవర్ణ!
నీదు రూపంబు దర్శింప నిండు మతిని
ప్రేమ కౌగిలి నివ్వేను బ్రీతిఁగొల్తు.

17. నీదు నామంబు భావనన్ నెమ్మిఁదలఁతు!
హారతిన్ గొనుమంచును నాదరమున
నాముఁడెంతయు భక్తిని నయముతోడ.
సాయి! జగదీశుఁ జేరెను శ్రద్ధతోడ.

18. నీవె! తల్లియు, తండ్రియు నీవె! సఖుఁడు.
నీవె! చుట్టము బంధువు నీవె! ధనము.
నీవె! సర్వము నాదేవ! నిజము కృష్ణ!
సర్వ జగముల ప్రభుఁడవు! సాయిదేవ!

19. త్రికరణంబుల, నింద్రియ ధిషణములను,
ప్రకృతి యాత్మస్వభావాది నికరములను,
సర్వకార్యము లేవిధి జరుగుచుండు.
నట్టివానికి సర్వేశుఁడధికుడంచు!
విష్ణుమూర్తి నారాయణ విభుని గొలుతు!

20. కేశవాచ్యుతు, శ్రీరాము, కృష్ణు, వరదు,
శ్రీధరు, మాధవు, గోపాలు, శేషశయను,
వివిధనామ వికాసుని, వేదవేద్యు,
పతితపావను, షిరిడీశు, నుతియొనర్తు!

## (6) నామస్మరణము

ఓం హరే రామ! హరే రామ! రామరామ! హరే హరే!
హరే కృష్ణ! హరే కృష్ణ! కృష్ణకృష్ణ! హరే హరే!

# మంత్రపుష్పము

1. హరిః ఓం! యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాస్తానిధర్మాణి
ప్రథమా న్యాసన్! తేహనాకమ్ మహిమానం స్సచంత
ఓం రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే
నమో వయం వైశ్రవణాయ కుర్మహే॥
నమో కామాన్ కామకామాయ మహ్యం।
కామేశ్వరో వై శ్రవణో దధాతు
కుబేరాయ వై శ్రవణాయ, మహారాజాయ నమః॥

2. ఓం స్వస్తి సామ్రాజ్యం భోజ్యం
స్వారాజ్యం వై రాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం।
మహి రాజ్యమాధిపత్యం మయం సమంత వర్యా
ఈశ్యాస్సార్వభౌమః స్సార్వాయుష ఆన్
తాదావరార్ధాత్ పృథివ్యై సముద్ర పర్యం తాయా
ఏక రాళ్ళితి తదప్యేష శ్లోకో ఽభిగీతో మరుతః
పరివేష్టారో మరుత్త స్యావసన్ గృహే!

అవిక్షి తస్యకామ ప్రే విశ్వదేవాః సభాసదఇతి
శ్రీ నారాయణ వాసుదేవ! సచ్చిదానంద సద్గురు సాయినాథ్
మహారాజ్ కి జై!

(7) వందనము

# నమస్కారాష్టకము

1. ఏ విధంబున కీర్తింతు భావజారి!
ఏ విధంబున వందన మిడెద దేవ!
శేషుఁడైనను నీగాథఁజెప్పలేడు!
వందనము! దేవ! సాష్టాంగ వందనంబు!

2. త్వత్పద ధ్యాన మెప్పుడు తప్ప నేను!
భక్తి భావన కీర్తియు పరిఢవిల్లు!
మాయ సంసార బంధము మాసిపోవు!
వందనము! దేవ! సాష్టాంగ వందనము!

3. పరమ లీలలఁజూపెదు ప్రత్యహంబు!
పామరులకు కన్పింతువు పామరునిగ!
కాని నీయంత రంగము కాంతి పథము!
వందనము! సాయి! సాష్టాంగవందనంబు!

4. జన్మలందున మానవ జన్మ ఘనము.
మోక్షమందించు ఘనజన్మ మూల మీవు.
అహము నణగించు జన్మంబు మహితపథము.
వందనము! సాయి! సాష్టాంగవందనంబు!

5. మూర్ఖబాలుర హస్తముల్ ముట్టవయ్యా!
ముగ్ధులను మమ్ము మురిపించి మోక్షమిమ్ము!
ప్రేమమధుపాన మెంతేని పేర్మిఁగొనుము!
వందనము! సాయి! సాష్టాంగ వందనంబు!

6. సురాధీశ! సంస్తుత్య శోభాపదంబుల్,
శుకాదుల్ సమానుల్ వచోక్తిన్ సుధాబ్ధీ!
ప్రయాగాది తీర్థాలు భక్తిప్రసారుల్
నమస్కార సాష్టాంగ! నా సాయినాథా!

7. ప్రభూ గోపికల్ మీదు పాదాలఁ జేరెన్
సదా మీ మనోరూప సక్తిన్ కనంగన్
హరీ! రాసలీలల్ మహానంద మందన్
నమస్కార సాష్టాంగ! నా సాయినాథా!

8. భవాబ్ధీవిలగ్నున్ విపత్తున్ మహేశా!
కరాలెత్తి కీర్తింతు కారుణ్యా ముంచన్
మహామాయఁ బోగొట్టి మమ్మాదుకోవే!
నమస్కార సాష్టాంగ! నా సాయినాథ!

(8) ప్రార్థన.

9. రమ్ము! సాయి దిగంబరా! రమణమూర్తి!
అక్షయ స్వరూపా! భువనావతార!
సర్వమయసాయి! శ్రుతిసార! సౌమ్యరూప!
సుగుణులౌ అనసూయా ఉత్రి సుతుఁడవయ్యా!
రమ్ము సాయి! దిగంబరా! రమ్ము! దేవ!

10. స్నానజపముల కాశిలో జరపుచుందు.
కొల్హపురిలోన భిక్షను గొనెదు దేవ!
తుంగ జలపాన మాత్రాన తుష్టిఁగొనెదు.
మాహురాపురి విశ్రాంతి మందిరాన.
రమ్ముసాయి! దిగంబరా! రమ్ము! దేవ!

11. వామకరమున జోలెను వదల వెపుడు.
డమరువు, త్రిశూలములను దాల్తువయ్యా!
భక్తవరద! సుఖప్రద! భవవిదూర!
రమ్ముసాయి! దిగంబరా! రమ్ము దేవ!

12. స్వామి! నీపాదపాదుకల్ సౌఖ్యనిధులు!
గొప్ప జపమాల జలపాత్ర లొప్పుదేవ!
డంబ మెఱుఁగవు! మృగచర్మధారివయ్యా!
నాగ జటల మకుట మొప్పు జోగివయ్యా!
రమ్ముసాయి! దిగంబర! రమ్ము! దేవ!

13. ధ్యాన సంలగ్న దాస సదనము లందు,
లక్ష్మి నివసించు పగటిని రాత్రులందు,
సంకటంబులఁ దొలగించు సాయినాథ!
రమ్ము!సాయి! దిగంబరా! రమ్ము! దేవ!

14. సంతసంబున మీ నామ చరితలెపుడు.
గాన మొనరించు వారికిఁ గలుఁగు సుఖము.
ధ్యాన యోగ సద్గురుపాద దర్శనమున.
రమ్ము!సాయి! దిగంబరా! రమ్ము!దేవ!

# శ్రీ సాయినాథమహిమ్న స్తోత్రము.

1. సదా సత్స్వరూపం చిదానంద కందం
జగత్సంభవస్థానసంహారహేతుమ్!
స్వ భక్తేచ్ఛయా మానుషం ధర్మయంతం
నమా మీశ్వరం సద్గురుం సాయి నాథమ్!!

2. భవధ్వాంత విధ్వంస మార్తండ మీడ్యం
మనోవాగతీతం మునిర్ధ్యాన గమ్యమ్!
జగద్వ్యాపకం నిర్మలం నిర్గుణంత్వాం, నమామి॥

3. భవాంభోధి మగ్నార్థితానాం జనానాం
స్వపాదాశ్రితానాం స్వభక్తి ప్రియాణామ్!
సముద్ధారణార్థం కలౌ సంభవంతం, నమామి॥

4. సదానింబ వృక్షస్య మూలాది వాసాత్
సుధాస్రావిణం తిక్తమవ్యప్రియంతమ్।
తరుం కల్పవృక్షాధికం సాధయంతం, నమామి॥

5. సదా కల్పవృక్షస్య తస్యాది మూలే
భవద్భావ బుద్ధ్యా సపర్యాది సేవామ్
నృణాం కుర్వతాం భుక్తి ముక్తి ప్రదంతం, నమామి॥

6. అనేకాశృతా తర్క్యలీలా విలాసైః
నమా విష్కృతేశాన భాస్వత్ప్రభావమ్
అహం భావ హీనం ప్రసన్నాత్మభావమ్, నమామి॥

7. సతాం విశ్రమారామమేవాభిరామం
సదాసజ్జనైః సంస్తుతం సన్నమద్భిః
జనామోదం భక్త భద్ర ప్రదంతం, నమామి॥

8. అజన్మాద్యమేకం వరం బ్రహ్మసాక్షాత్
స్వయం సంభవం రామమేవావతీర్ణమ్
భవద్దర్శనాత్సం పునీతః ప్రభో మాహం, నమామి ||

9. శ్రీ సాయీశ కృపానిధేఽఖిలనృణాం సర్వార్థసిద్ధిప్రదా
యుష్మత్పాదరజః ప్రభావమతులం ధాతాపి వక్తాఽక్షమః
సద్భక్త్యా శరణం కృతాంజలి పుటః సంప్రాపితోఽస్మిప్రభో
శ్రీ మత్సాయి పరేశ పాదకమలాన్నాన్యచ్ఛరణ్యాం మమ||

10. సాయి రూపధర రాఘవోత్తమం
భక్తకామ విబుధద్రుమం ప్రభుమ్
మాయా యోపహత చిత్తశుద్ధయే
చింత యామ్యహమ్ అహర్నిశం ముదా||

11. శరత్సుధాంశు ప్రతిమప్రకాశమ్
కృపాతపత్ర తవ సాయినాథ!
త్వదీయ పాదాబ్జ సమాశ్రితానాం
స్వచ్ఛాయయా తాప మపాక రోతు!!

12. ఉపాసనా దైవత సాయినాథ
స్తవైర్మయోపాస వినాస్తు తస్త్వమ్
రమే న్మనో యే తవపాద యుగ్మే
భృంగో యదార్ధే మకరందలుబ్ధః||

13. అనేక జన్మార్జితయోపాపసంక్షయో
భవేద్భవత్పాద సరోజ దర్శనాత్
క్షమస్వ సర్వానపరాధపుంజకాన్
ప్రసీద సాయీశ! గురో దయానిధే!||

14. శ్రీ సాయినాథ చరణామృత పూతచిత్తా
స్తత్పాదసేవన రతాస్సత తంచ భక్త్యా!
సంసార జన్మదురితౌఘ వినిర్గతాస్తే
కైవల్యధామ పరమం సమాప్నువంతి||

15. స్తోత్రమే తత్పఠేద్భక్త్యా యోనరస్తన్మనాః స్సదా
సద్గురోః సాయినాథస్య కృపాపాత్రం భవేద్ధ్రువమ్||

## ప్రార్థన.

కరచరణకృతం వా కాయజం కర్మజం వా
శ్రవణ నయనజం వా మానసం వాపరాధమ్!
విదిత మవిదితం వా సర్వమేతత్ క్షమస్వ!
జయజయ కరుణాబ్ధే! (శ్రీప్రభో! సాయినాథ)||

శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహరాజ్ కీ జై!!
మధ్యాహ్న హారతీ కార్యక్రమము పరిసమాప్తము.
మధ్యాహ్న హారతి కార్యక్రమము (సాయంకాల పూజాకార్యక్రమమున పఠించవలెను)

## (మూడవ భాగము)
## ధూప హారతి.

సూర్యాస్తమయ సమయ సంధ్యాకాలమున చేయు హారతి. ధూపదీప నైవేద్య దర్శనానంతరము ఒక వత్తి (దీపంతో) హారతి ఇవ్వవలెను.

1. మధ్యాహ్న హారతిలో. 3. సౌఖ్యమందారం అను పద్యము నుండి 20వ పద్యము వరకు. నమనము

2. నమస్కారాష్టకము, శ్రీ సాయినాథ మహిమ్నస్తోత్రము పూర్తిగ పఠించవలెను.

# 3. శ్రీ గురు ప్రసాదయాచనా దశకము.

1. అమ్మనాన్నలు ననుజులు నాత్మసతియు,
కన్నబిడ్డలు బంధువుల్ నున్నవారు,
అలుకబూనిన నాకేమి కలత లేదు,
అభయ మొసఁగుమ! శ్రీదత్త! అలుక లేక!

2. కోడలు, వదిన, బంధువుల్, కూర్మి సఖులు,
నన్ను లెక్కింప కుండిన మిన్నకుందు,
షిరిడి సాయి! దత్తేశ్వర! చిద్విలాస!
అలుకఁబూనకు నాపైన నంజ లిడుదు!

3. పిన్నలున్ పెద్దలు తరుణుల్ పిరికివారు,
ఎవ్వరేమను కొన్నను ఎగసి పడను,
షిరిడిసాయి దత్తేశ్వర! చిద్విలాస!
అలుకఁబూనకు నాపైన నంజ లిడుదు!

4. చతుర తాత్త్వికుల్, విబుధులు, సర్వవిదులు,
అలిగినన్, విదుషీమణుల్, యతులు, పతులు,
భక్తులున్, మహాపండితుల్ పగ వహింప,
మనము నందున నెవ్వగ మసల నీను!
అభయ మొసఁగుమ! శ్రీ సాయి! అలుక లేక!

5. గ్రామకులగృహదేవతల్, కావ్యబుషులు,
అనఘ సిద్ధులు, యోగులు నలుకఁబూన
మలిన ఢాకినీ ఖల పిశాచులుఁ గనలిన
భయముఁజెంద నీదయ చాలు భవవిదూర!

6. అఖిల జంతువుల్ పగఁబూన నదురు లేదు!
నదులు, సంద్రముల్, ప్రస్తరానగములైన
వృక్ష సంతాన మలిగిన వెలితి లేదు!
నీవు మాత్రము అలుగకు నీలకంఠ!

7. యక్ష గంధర్వ చంద్రార్కు లలుగ నిమ్ము
గగన తారకల్ గ్రహములు కాలయముఁడు
ఇంద్ర వరుణులు నలిగిన నేమిలేదు
దత్తసాయీశ! అలుఁగక దయను గనుమ!

8. త్రికరణములు కాలమున్ దిక్కు లెల్ల
సర్వలోకాలు నలిగినన్ చలన మొంద!
షిరిడిసాయి! దత్తేశ్వర! చిద్విలాస!
అలుకఁబూనకు నాపైన నంజలిడుదు!

9. ఈసడించిన లోకులు ఏమి భయము!
పాము కఱచినన్ శ్రీసాయి పదముఁగొలుతు
జన్మబంధవిమోచన సక్తునగుదు!
ధీర దురంబు భద్రమై తేజరిల్ల!
అశుభ కల్పనన్ ఆటంక మమరుగాక1
ఇహికాకాంక్ష లుడిగి మహాత్మునగుదు!

10. కాంక్షలున్ ద్వేషమెందేని కలుగ నీక,
మనమునన్ సాయిమననము మసలుగాక!
గురుపదాకాంక్ష మనమునఁగుదురుఁగాక
విశ్వమంతయు సాయిగా వెలయుఁగాక
సాయి గురుదత్తమాత! సహాయ పడుమ!
అలుకఁబూనకుమా! భిక్ష నడుగుచుంటి!

మంత్ర పుష్పాంజలి ప్రార్థన కరచరణకృతం అను వానిపూర్తి
గపఠించవవలెనుసంధ్యా కాలపు ధూప హారతి సమాప్తము.

# నాలుగవ భాగము

# శేజ్ హారతులు

రాత్రి 10 గంటలకు దూపదీప నైవేద్యము లీయవలెను.
ఐదు వత్తులహారతి అర్పించవలెను.

## 1. ప్రార్థన.

1. హారతుల్ గొను గురుదత్త! ఆర్తిహరణ!
పంచహారతీతత్త్వముల్ ప్రభలు చింద!
తగు నిరాకార సాకార తత్త్వమెట్లు?
మాతృమూర్తిగ మముఁజూడు! మహిత భావ!
సర్వమును నిండి మిగిలిన సాయిదేవ! ||హారతులు||

2. త్రిగుణ సహిత మాయిన ద్వైతము పెట్టు? ||హారతులు||
సప్తవనధులు ఖేలన సలమ్దెటు? ||హారతుల్||
నిఖిలబ్రహ్మాండ రచనంబు నీకెతెగును!
దయఁగనఁగ మాయనుఁబాపఁదగుదువీవె! (దేవ!)
అనుచుఁబల్కె! తుకారాముఁడాదరమున! ||హారతుల్||

## 2. హారతి జ్ఞానరాయాచీ

1. విశ్వ కళ్యాణ కైవల్య విభవసాయి!
జ్ఞాన హీనులు హితమును మానినారు.
పాండు రంగడు నీవంచు పఠితులనిరి.
హారతిన్ గొను జ్ఞానేశ! ఆదిదేవ!

2. మధుర నామస్మరణమది మాన్యులెల్ల!
నీ పదార్చన సంలగ్న నియతులైరి!
స్వర్ణ పాత్రల హారతుల్ సంతరించి!
గోపికా కాంత లిరువురుఁగూడినారు!
నారదాదులు వేదోక్త కీర్తనములఁ ||పాండురంగఁడు||
గొలువుఁదీరిరి దత్తేశ! కూర్మితోడ||

3. విశ్వగొప్ప పరంధామ! వివిధరూప!
భవ్య రామజనార్థన భక్తుఁడొప్పె!
మస్తకంబుంచె భవదీయ మాన్యపదుల!
పాండు రంగావతార! శుభప్రభావ!

## 3. ఆరతీ తుకారామాచీ

4. సద్గురుస్థాన పరమేశ! సామిదేవ!
సచ్చిదానంద నీపద స్పర్శయేది?
హారతుల్ తుకారామేశ! అనఘ విభవ!
హారతిన్ గొను జ్ఞానేశ! ఆదిదేవ! ||2 సార్లు||

5. శ్రీశు నిర్మాణ వారధి శిలల పోల్కి,
నీటఁ దేల్చిన భంగాల నెమ్మిఁ గనిన
చాగిలుచు రామదేవుండు త్యాగబుద్ధి!
బ్రహ్మతానెయౌ సాయికి భక్తి మ్రొక్కె,

## 4. శేజ్ హారతి

6. జయము షిరిడి దత్తాత్రేయ! జయము దేవ!
హాయిగన్ పవళింపుమో సాయి దేవ!
జయము షిరిడి దత్తాత్రేయ! జయము దేవ! ||జయము||
హారతిన్ గొను గానంబు నర్థిఁజేతు! ||హారతిన్||

7. ఆదరింతువు తల్లిగా నమృతమూర్తి!
రోగి రోగమున్ గొందువు రుజను బాప,
భక్తులన్ గావ వేగమె పరుగులిడుదు!
కష్టమెంచక భక్తులఁ గాచు దేవ!

8. పూల పాన్పున నిద్రింపఁ బూను కొనుఁడు!
సహన సుమశయ్యఁ బవళించి శాంతిఁగనుడు!
ఆర్తులొసఁగెడు పూజల నందుకొనుఁడు!
ప్రాణ పంచక జ్యోతులన్ బట్టినాను!
దివ్యకాంతుల నిన్గొల్వ తివిరినాను!

9. సేవనానంద సుమముల స్వీకరించు!
మీదు పాదార్చఁజేయఁగ మిగులి యుండు!
మీ ప్రసాదమున్ గొనిపోదు మేల్మిభక్తి!
మిమ్ము మేల్కొల్పి కందుము మేలు భక్తి
సాయి, మాత! మా హారతుల్ సరవిఁగొనుమ! జయము||

## 5

1. నిదురబో సాయి! అవధూత! నిఖిలరక్ష!
చిన్మయానంద మందిరక్షేత్రమందు ||2 సార్లు||
కర్మవిరాగ కుంచికశుభ్రకాంతి తలము
ప్రేమసలిల సంప్రోక్షణధామకంబు! ||నిదుర||

2. నవవిధాసక్తిచేల విన్యస్తకంబు,
జ్ఞాన దీపిక కాంతి విస్తార గుణము || నిదుర 2 సార్లు||
హృదయ నిర్మల మానస మృదు సుమంబు!
పాన్పు సొంపుగ సవరించి పఱచినాను ||నిదుర 2 సార్లు||

3. దేవుఁడొక్కఁడు కాడను వారి దీర్చు బుద్ధి,
వారి వాకిలి తలుపులు వైచినావు!
దేవుఁడొక్కడే యనుబుద్ధి దిట్ట పఱుప
సాయి మాయను నేనేమి చాటఁగలను!

4. చెడుగు ముడులను విడదీసి చెంత తెరను
వేసికొంటివి నిదురఁబో వేడ్క- దేవ! ||నిదుర, 2సార్లు||

5. కోరికల దప్పుల నణంచి కుదురు కొనంగ,
దయయు, సహనంబు శాంతియున్ దాసులగుచు,
నీ పదకమలసేవకై నిలచినారు!
నిదురబో! నా తండ్రి! నియతి చరిత!

6. సౌఖ్యమెంచని సుఖమను శాల్వతోడ
శాంతి పాన్పున పవళింపంజక్కంజేసి
హాయి నిదురింపంజేతుమో ఆది దేవ!
నిదురంబో! సాయి! అవధూత! నిఖిల రక్ష!

*సద్గురు సాయిరాజ్ మహారాజ్ కీ జై!!*

## 6. ప్రసాదమును గైకొనుట

1. అరగింపును గొంటివా! ఆది దేవ!
భక్తింగొందుము శేషాన్న పాయసంబు
భాజనంబులం గొంటిమి భోజనార్తి!
నిశ్చలార్చిత భావంబు నెఱయ మేము!

2. నీ ప్రసాదము దొరికెను నిర్మలాత్మ!
తలప నీశ్రమన్ గుర్తింపంగలిగినాము!
సాయి గోపాల! సుఖనిద్ర చలుపు మయ్య!
కోర్కెలన్నియుం దీరె మా కూర్మి తండ్రి!

3. సాయిబాబ! శుభాశుభ చర్యలందు
కర్మదోష పీడలు బోవంగాంతుమయ్య!
ఇతర మెంచక నినుంజేర నెంచినాము
ఇష్ట మృష్టాన్న మర్పింప నియ్యకొంటి!

## స్తవము

1. సాయి గురుదేవ! దయఁజూడు హాయి నిడగ
త్రివిధ పాపాలు మమ్ములఁ దెలియకంటె!
కోరికల్మాన్పఁ జూడుము! కూర్మి దేవ!
దీనజన బాధలడపంగ దిట్టవీవు
బిడియ మెంచకు మంచును పేర్మిమొక్కె!
కృష్ణకవిదాసు సాయీశు కృతియొనర్చి!

ఓం! రాజాధిరాజ! యోగ రాజ! పరబ్రహ్మ శ్రీ సచ్చిదానంద! సద్గురు సాయినాథ్ మహారజ్ కీ జై॥

*శేజారతి కార్యక్రమము సంపూర్ణము.*

# శ్రీ గణేశ హారతి.

రామదాస కృతి మరాఠీకి తెలుగు.
పతి యత్సవములో సంధ్యాహారతి సమయంలో పాడునది
సాయి హారతి తరువాత పాడవలెను.

విఘ్న రాజ! నీ స్మరణంబు విజయ పథము
దోష భూయిష్ఠ దురితాది దోషహరము!
సుభగ సర్వాంగ సిందూర సుందరాత్మ!
జయము నీకగు విఘ్నేశ! సామజాస్య!

ముత్తెపు సరాల రాజిల్లు మోహనాంగ!
జయము హరకుమార! వరద! జయము! శుభము!
కామితంబులు సిద్ధించుఁ గాంచ నిన్ను!

రత్నఖచితంబు వస్త్రంబు రంజితంబు.
కుంకుమాంచిత కేసరీ కొమరు ఛాయ
రత్నశోభా కిరీటంబు రాజిలంగ,
మంజులంబౌ ధ్వనితము నీ యందె రవళి!
జయము! విఘ్నేశ! శుభమగు శంభుతనయ!
హరకుమార! నాగాంకిత హారచేల!
వక్రతుండోదర వికాస! వరముకుంద!
రామదాస ధామ విహార! రమణనేత్ర!
సర్వసంకటనిర్వాణ! సఫల విభవ!
విఘ్ననాయక! దయఁజూడు వేడుకొందు!

||జయము హర కుమార||

# శ్రీ సాయినాథ మంగళహారతి

1. సాయి భక్తప్రియజన సంగతంబు!
దాస కోర్కెలీడేర్చు బృందావనంబు!
ప్రభు విలాస స్మరణ మధురామృతంబు!
రమ్యలీలా స్వరూప నీరాజనంబు!

2. మౌని జన వంద్యునకు నీకు మంగళంబు!
మహిత సద్రూపవర! నీకు మంగళంబు!
మన్మథాంతకస్ఫూర్తికి మంగళంబు!
మధుర వాక్ప్రశాంతా! నీకు మంగళంబు!

3. స్వామి సాయి నాథాయ షిరిడిక్షేత్ర వాసాయ
మామకాభీష్టదాయ మహిత మంగళం!
లోకనాథాయ భక్తలోక సంరక్షకాయ
నాగలోకస్తుత్యాయ నవ్యమంగళం! ||స్వామి||
భక్త బృంద వందితాయ బ్రహ్మస్వరూపాయ
ముక్తి మార్గ బోధకాయ పూజ్యమంగళం! ||స్వా
సత్యతత్త్వ బోధకాయ సాధు వేషాయ తే
నిత్యమంగళ దాయకాయ నిత్యమంగళం! ||స్వా

'సర్వేజనా స్సమస్తాస్సుఖినో భవంతు'
ఓం తత్ సత్.



